# మంచు తెరలు







ఇసుకపల్లి లక్ష్మీ నరసింహశాస్త్రి.



ప్రచురణ :
నవీన గ్రంథమాల,
విజయవాడ-2.

5

# 1

తోటలో ఫౌంటెన్ దగ్గర [...]ాపరాయిమీద కూర్చుని విపరీతంగా ఆలోచించుకుంటోం[...] అఖిల. తన కెప్పుడూ కమలమీద ద్వేషంగాని, అసూ[...]యకాని కలగలేదు. కాని యీ మధ్యనుంచీ ఎందుచేతనో [...]కమలంటే అదోరకమైన అభిప్రాయం వస్తోంది. కారణం ఫ[...]ానా అని పైకి చెప్ప లేకుండా వుంది. మమతతోపాటు [...]మాత్సర్యంకూడా పెరుక్కుంటూవస్తోంది. కమల చాలా మంచ[...]ది. అమాయకురాలు. అవ్యాజమైన ప్రేమకలది. కమల చాలా [...]చెడ్డది. గుంభనగా వుంటుంది. కనబడని అసూయ ఆమెలో ప్రోంచికూర్చుంది. ఈ రెండు విరుద్ధభావాలకు సరిపడ్డ పరిస్థితులు, సంఘటనలు [...]రచు కనిపిస్తూనే వున్నాయి.

మత్తెక్కే సువాసనలు మోసుకువచ్చిన గాలులు [...]డులు తిరుగుతూ ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఆఘ్రా[...]స్తూ ఆయాసపడుతోంది.

చిన్న గేటుతలుపు మెల్లిగాతీసి గట్టిగానాసికారంధ్రాల్లోకి [...]ుమును ఎక్కించి, ఏ సువాసనలకు దాసోహం కాకుండా [...]ాదిగా వస్తున్నాడు రమణ. క్షణమాగి నాలుగువైపులా [...]శాడు. తోటంతా బోసిపోయివుంది. మాలి నీళ్ళుపోస్తూ [...]క్క మొక్కదగ్గర ఆగుతున్నాడు.

"మాలీ! ఒక్క పువ్వు వుంచావ్ కాదు... తోటందమేది...?" అన్నాడు రమణ.

"నన్నేం చెయ్యమంటారండి! అమ్మగారు అన్నిపూలు కోసుకు రమ్మంటుంటేను...", సమాధానం యిచ్చాడు.

"ఆడపిల్లలకు పూలంటే సరదా. కాని తోటఅందం కాపాడాల్సింది నువ్వు. ఏ అమ్మగారు!"

"అరుగో అక్కడ కూర్చున్నారు..." నాలిక కరుచుకున్నాడు మాలి.

'అఖిలా' తన లోతాను అనుకొన్నాడు. మెల్లిగా "అమ్మాయి" అన్నాడు.

అఖిల ఉలిక్కిపడింది. ఒంటరితనంలో హాయి వుంది. అన్నింటిని అనుభవిస్తున్నట్లు ఊహించుకుంటూ వింత అనుభూతి పొందవచ్చు. అలివికానివాటినికూడా సునాయాసంగా తన కళ్ళయెదుట తెచ్చిపెట్టుకుని, మనసారా తాపాన్ని, కోపాన్ని తీర్చుకోవచ్చు. ఆ అనుభూతిలో అనంతమైన ఆనందం వుంది. తృప్తివుంది. తన కోర్కెలు తీరుతాయో, లేవో అనే భయంతో అన్నింటిని ఒక్కపెట్టున ఆలోచించుకుంటోంది. తబ్బిబ్బులవుతున్న అఖిలమనస్సు స్వైరవిహారం లోంచి అమాంతంవచ్చితోటలోకిదిగింది. ఆమెకళ్ళు అటూ యిటూ కదిలినాయి. రమణను చూసినాయి. మళ్ళీ యీ ప్రపంచంలోకి వచ్చేటప్పటికి అన్నీ సమస్యలే అన్నీ ప్రశ్నలేఎదురయినాయి. అమాంతం అన్నీ దాడిచేశా

కలవరపెట్టేసినాయి. తెప్పరిల్లి, గుటకలువేస్తూ 'మీరా' అనగలిగింది.

"ఏమిటంత గాబరాపడ్డావ్. ప్చ్... ప్చ్..."

తన మనోభావనల ఛాయలు మొహంలో కనబడనీయకుండా ప్రయత్నంచేస్తోంది. మనస్సువిశ్రాంతికి యీ తోటలో కూర్చుంది. తాను కోరుకున్న విశ్రాంతి పొందగలిగింది. కాని, ఆ ఆనందమే యింకా అనుభవిస్తూ ఎంతోసేపు వుండిపోవాలన్న గాఢమైన వాంఛను రమణ వచ్చి భగ్నపరిచాడు. అందుకు కోపమూ వచ్చింది. తననేమైనా అడుగుతాడేమోనని భయమూ వేసింది. ఒంటరిగా కూర్చున్నప్పుడు తన జోలికి యెవ్వరూ రాకూడదని మారుమూలగా వచ్చి కూర్చుంది. మాలితో చెప్పనే చెప్పింది, తోటలోనికి ఎవరైనా వస్తే చెప్పమని. కాని అతను చెప్పలేదు. మనస్సు చిత్ర విచిత్రమైనది. దేనినైనా ఆలోచించకలదు. మిశ్రితమైన భావాల గజిబిజిలో అఖిల అలసిపోయింది.

"ఏమీ లేదు" అన్నది గంభీరగా.

నవ్వాడు రమణ. ఆ నవ్వులో ఆమెమనస్సు తెలుసుకున్నానన్న ధీమా కనిపించింది. అఖిల భరించలేకపోయింది. ఉక్రోషం వచ్చేసింది. కాని ఆయనను ఏమీ అనలేదు. అనలేకపోయింది. తన తండ్రి వయస్సు. యించుమించు ఆ యింట్లో రమణకు అన్నిఅధికారాలు వున్నాయి.

బలవంతంగా నవ్వుతెచ్చుకుని "ఏమీ లేదండీ" అంది కాస్త అణకువగా.

"నాకు తెలుసు. ఈయీాడు పిల్లలంతా యింతే... ! ఏమిటో ఆలోచనలు. మంచిదే, ఆలోచించటం మంచిదే! అయితే ఒంటరిగా కూర్చుని ఆలోచించట మెందుకూ! జంటగా కూర్చుని ఆలోచించండి అంటాను నేను... అంతేనా!"

"సరేలెండి. మీరా రెప్పుడూ యిట్లాగే అంటారు" అంటూ చివాలున లేచి చకచక వెళ్ళిపోయింది.

అఖిల అమాయకురాలు కాదు. కమల గడుసరి అయినా, వట్టి భోళా పిల్ల అనుకున్నాడు రమణ.

కొబ్బరిచెట్టుమట్టలుగాలికిఊగుతుంటేచిత్రంగాపైకిచూస్తు న్నాడు. వెలవెలబోతున్నచందమామఆమట్టలమధ్యతమాషాగా కదులుతున్నట్లు కనిపిస్తోంది. కాలిక్రింద భూమి గిర్రున తిరుగు తున్నట్లనిపించింది. ఆకాశం కదులుతోంది. చప్పున కళ్ళు మూసుకున్నాడు. నిజానికి తన వళ్ళు తూలింది. కొద్దిసేపట్లో కళ్ళు తిరగటం సర్దుకుంది. ఒక్క అడుగు బరువుగా వేశాడు ముందుకు. ఆపాదమస్తకం ఒక్కసారిగా చూసుకున్నాడు. "అవును. నేను పెద్దవాడ్నయిపోతున్నాను. అదివరకున్న పటుత్వం ఇప్పుడులేదు. ఆ ఓపికలు ఇప్పుడు లేవు. ఆ ధైర్యం యిప్పుడులేదు. ఆ వుత్సాహంకుంగింది. నిజమే. వయసొచ్చి బరువుగా శరీరంమీాద కూర్చుంది. ఫరవాలేదు. ఇంత ముసలి మావగారు అని నన్ను ఆక్షేపణచేసేముందరే అమ్మాయికి కాస్తా వివాహం జరిపిస్తే నా బాధ్యతంటూ ఏదైనా వుంటే

అది తీరిపోతుంది." అనుకుంటూ గట్టిగా భూమిమీద అడుగు వేశాడు.

పెద్ద నిట్టూర్పువిడిచి ముందుకు సాగిపోయాడు. లోపల సావిట్లోకి అడుగు వెయ్యంగానే వంటింట్లోంచి వాగేశ్వరి వస్తున్నట్లుచూసి తృళ్ళిపడ్డాడు. తనకే ఆశ్చర్యంవేసింది. 'యెందుకివ్వాళ శరీరంలోకి వణుకువచ్చింది' అనుకున్నాడు. ఈ మధ్య నుంచే ఆమెను చూస్తుంటే తన నేదో తెలియని భయంవచ్చి ఆవహిస్తున్న ట్లవుతోంది. తమాయించుకున్నాడు అట్లాగే నిలబడి పోయాడు. ఒక్క అడుగు ముందుకు వెయ్యబోతూ చప్పునఆగి తలెత్తి పైకిచూసింది వాగేశ్వరి. రమణ కనిపించేటప్పటికి నివ్వెరపోయింది. హృదయభారం యిట్టే యెక్కువై పోయింది. ఆయన కంటికి కనిపించగానే వింతైన ఆలోచనలు వస్తున్నాయి తన మనోభావాలన్నింటిని అణచివేసుకుని నిబ్బరంగా ముందుకు వచ్చేసింది. ఏమి మాట్లాడతారో అనే ఆవేదనగా అతని మొహంలోకి చూస్తోంది. అతను తొణకలేదు. ఆమె మనస్సులో తెలియని ఆందోళన కలుక్కుమంటూనే వుంది. పైకి చెప్పేటంత పరిపక్వదశకు పరిస్థితులు రాలేదేమోనని ముభావంగా వూరుకుంటోంది. కాని ఆమె సహజమైన తాపత్రయంమాత్రం తటస్థంగా వూరుకోనీయడం లేదు. ఎప్పటికప్పుడు తన మనస్తాపాన్ని తెలియచెయ్యాలని ఆవేదనపడుతూనే వుంటుంది. నిజమేమిటో తెలుసుకొని అబద్ధాన్ని విడిచేసి రెంటిని రెండు భాగాలుగా చూడాలని తపన పడుతోంది. కాని సత్యమూ అసత్యమూ రెండూ కలిసే కనిపిస్తున్నాయి. తాను చూస్తున్నవాటిల్లో తాను

కోరుకున్నవి కనబడటం లేదు. తనకు కనిపించనివాటిలో తనకు కావలసినవి వున్నాయని ఆమె అభిప్రాయం. ఈ తికమకలతో సతమత మవుతోంది.

ఇంతకీ ఆడపిల్లల వివాహ సమస్య విషయమే యింత మథన. అఖిల పెద్దది. కమలే అఖిలకంటె చిన్నది. తనభర్త పెద్ద వకీలు అవడంవలన ఆయన గొప్పతనంలో సగం తనకు సంక్రమింప చేసుకొని హుందాగా చెలామణి అవుతోంది. ధీమాగా తాను సృష్టించుకున్న సాయిలో నిలబడి వుంటుంది. ఇంటి వ్యవహారాలలో తన భర్తకు ఏ విధమైన జోక్యం లేకుండా చేసుకుంది. కాని ఎప్పటికప్పుడు భర్తను అంటూనే వుంటుంది. 'మీరు యింటి విషయాలు పట్టించుకోకపోతే ఎట్లాగూ!' అంటూ. ఇట్లా అనటంలో ఆమెకో సరదా వుంది. 'నువ్వున్నావుగా అన్నీ చక్కదిద్దుకోవటానికి' అని భుజంగరావు అనటం ఆమెకు అభిమానమైన విషయం. తనమాట ఆయన జవదాటడని ఆమెకు గట్టి నమ్మకంకూడా. అయితే అంతా ఆయన అధీనంలో లేదు. ఆయనకు సమాన స్థాయి వయస్సులో వుంటూ, అన్ని విషయాల్లో తగు సలహాలిస్తూ, అండదండలుగా వుంటున్న రమణను గురించి యిప్పుడిప్పుడే కొన్నికొన్ని అనుమానాలు ఆందోళనలు కలుగుతున్నాయి.

నలుగురి దృష్టిలో రమణ కేవలం ప్లీడరు గుమస్తా అయినప్పటికీ, ఆయనకు అంతకు మించిన ఉన్నత స్థానమే ఆ యింట్లో వుంది. ఆ కుటుంబంతో అతని జీవితం పెన

వేసుకుపోయింది. ఒకరికొకరు అనుబంధంగా వుంటూ ఆద రాభిమానాన్ని యిద్దరూ సమానంగా పంచుకుంటూ భుజంగ రావంత మనిషిగా ఆరితేరాడు. కాని రమణమాత్రం తనను గురించి అంత ఉన్నతంగా ఆలోచించడు. చిత్రవిచిత్ర మైన ఆలోచనలు వస్తూవుంటాయి.

తన స్థితిగతులు వేరని ఎంత ప్రేమగానూ ఆప్యా యతగానూ వుంటున్నప్పటికీ, తన కుమార్తె వివాహం భుజంగరావుగారి పిల్లలతో జతపగచ కూడదని, యిద్దరి అంతస్థులు వేరని గట్టిగా అనుకుంటాడు. ఒక్కొక్కప్పుడు తీవ్రమైన అసంతృప్తికూడా కలుగుతూ వుంటుంది. దాపరికం లేకుండా నిర్మలంగా వుండాలని ఆయన ప్రయత్నం. అయితే ఆయనకు తెలియకుండానే కొన్నికొన్ని రహస్యాలు ఆయన మనస్సులోనే వుండిపోతాయి. పాపం! వాగేశ్వరి అయితే గుంభనగావుండాలని ఎంత ప్రయత్నంచేసినా తన మనస్సులో వున్నది కొంచెమైనా బైటకు చెప్పకపోతే ఆమెకు తోచదు. ఉక్కిరిబిక్కిరి అయినట్టుంటుంది.

'అన్నగారూ!' అంటూ దగ్గరకు వచ్చింది వాగేశ్వరి.

'మీతో ఈ ముక్క చెపుదామని యెన్నాళ్ళబట్టో అనుకుంటున్నానే గాని యెట్లా చెప్పాలో అర్థంగాక వూరు కున్నాను. మీ అమ్మాయి పెళ్ళి విషయంలో మీరు చూపిస్తున్న అశ్రద్ధ నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆడపిల్ల. తల్లి లేదు. ఎవరితో చెప్పుకుంటుంది. మీ రా మాత్రం

గ్రహించకపోతే యెట్లాగూ చెప్పండి...' తన హృదయ భారం చేత్తో తీసేసినట్లు తగ్గిన ట్లనిపించింది.

తేలికగా నవ్వేశాడు రమణ.

'మా అమ్మాయి పెళ్ళి ఘడియ వచ్చిననాడు నే నిట్లా కృంగిపోగలుగుతానా! మనం ఆదుర్దాపడితే పనులు అవుతాయటండీ అక్కగారూ' అన్నాడు.

ఈ సమాధానం యేమాత్రం సంతృప్తి నివ్వలేక పోయింది. పైగా తాను మనస్సులో పడుతున్న ఆందోళనను యింకొంచెం యెక్కువ చేసింది. తాను కోరుకున్న సమాధానం ఆయన దగ్గర్నుంచి రాలేదు. అయితే యింతకంటే కూడా బాధపడుతున్న విషయం యింకోటివుంది. అదికూడా ఆమెను పదేపదే కలవరపెడుతూనే వుంటుంది. రమణకు ఆ మనో వేదనను చెప్పేసి, తన భారాన్ని తగ్గించుకోవాలనుకుంటోంది.

'అంతే నంటారా!' అన్నది వాగేశ్వరి.

అవునన్నట్లు తల వూపాడు రమణ.

'నాకేమిటో భయంగా వుంది చెప్పొద్దూ! ఇన్నాళ్ళబట్టీ నేనున్న తీరువేరు. యీ రోజునుంచి నాలో యేదో మార్పు వస్తున్నట్లుగా వుంది. మంచి కొస్తుందో, చెడు కొస్తుందో అర్థంకావటం లేదు. మీ కన్నీ తెలుసు. మీకు ప్రత్యేకంగా చెప్పే అవసరం లేదు. అఖిల ఒకటీ, కమల ఒకటీ కాదు. వాళ్ళిద్దరి మధ్య భేదభావం నా కేమాత్రం

లేదు. వారికి వుందని నేను అనను. ఒకవేళ వారికివున్నా, ఆడదాన్ని నాకు వుండకూడదని నేను అనుకుంటున్నా, నాలో వస్తున్న మార్పు వారినిబట్టి వచ్చింది కాదని నాకు తెలుసు. కాని యీనాడు యెందుకు యింతతర్కం వచ్చిందో అర్థం కావటం లేదు. నా మనస్సు పరిపరివిధాల పోతోంది. మీతో యీ ముక్క చెపితే నా ఆందోళన కొంతవరకైనా తగ్గుతుందేమోననే భ్రమతో ... ...' మాట తడబడింది. ఇంకా ముందుకు సాగలేక పోయింది వాగేశ్వరి.

ఇట్టే పసిగట్టేసాడు రమణ.

"ఇదంతా మీ ఊహామాత్రమే! నిజానికి వారికీ లేదు, మీకూ లేదు. సృష్టిలో వచ్చిన భేదాన్నవుతే యెవరూ తొలగించలేరుకదా!" గంభీరంగా అనేశాడు రమణ.

"అంతేనంటారా!" నిర్ధారంగా చూసింది వాగేశ్వరి. ఆయన అన్నముక్కలో తనకేదో శాంతి లభించినట్లు తృప్తి పడింది.

గిరున రమణ, భుజంగరావుగదివైపుకు నడిచాడు.

భుజంగరావుకుర్చీలో చేరగిలపడి ఆలోచనల్లోనిమగ్నుడయిపోయాడు. రాజావిషయమే ఆయనకు ఆందోళనగా వుంది. ఎన్నో ఖూనీకేసులు ఆయన చేతిమీదుగా గెలిచినాయి. కాని ఈ కేసు అలాంటిదికాదు. ఆదుర్దాతోనూ బాధ్యతతోనూ కూడుకున్నది. చేతులు వణికిపోతున్నాయి. శరీరం అదురుతున్నట్టు అనిపిస్తోంది.

రాజా అమాయకుడు, మంచివాడు. చదువుకున్న వాడు, బుద్ధిమంతుడు, వృద్ధిలోకిరావలసినవాడు. ఇంతపని అతను చేశాడంటే తాను నమ్మలేకుండా వున్నాడు. కాని, 'నిర్దోషి' అని రుజువుకావటానికి తగినసాక్ష్యం కనబడటం లేదు. మాతృప్రేమతో అల్లల్లాడిపోతున్న సుగుణమ్మకథనం కోర్టువారికి అక్కర్లేదు. ప్రాసిక్యూషన్ వారు కేసును చాలా బలంగా తీసుకువస్తున్నారు. ఆయన ఆలోచన చప్పున మలుపుతిరిగింది.

హంతకునికి మరణశిక్ష విధించాల్సిందేనా! దానివలన ఏం ప్రయోజనం సాధించకలుగుతారు! హత్యఅనేది యెందుకుజరుగుతుంది! శరీరం స్వాధీనంలోలేని పరిస్థితుల్లో ఉద్రిక్తుడయి ప్రకోపాన్ని శాంతింపచెయ్యటానికి, తనకు జరిగిందనుకున్న అన్యాయానికి ప్రతిక్రియగా ప్రతీకారం చెయ్యటం! హత్య జరిగిపోయింది. అతనికోపం శాంతించింది. చివరకు పశ్చాత్తాపపడ్డాడు. అలాంటివ్యక్తిని పట్టి తెచ్చి న్యాయస్థానంలో ముద్రవేయించి, ఉరితియ్యటంవలన సాంఘికప్రయోజనం ఏమిటి? అతనిజీవితంలో పశ్చాత్తాప పడి బాగుపడే అవకాశం ఎందుకు వుండకూడదు? అతన్ని ఉరితీసినంతమాత్రాన హత్యల్ని అరికట్టకలుగు తున్నారా? క్షణికోద్రేకంవలన మానవుడు రాక్షసరూపం దాల్చటంలేదా? ప్రభుత్వంకూడా ప్రతీకారం తీసుకుంటే, యిక రక్షించేదెవరు? అది మరణశిక్ష కాదు. ఉరిశిక్ష కాదు. కేవలం దారుణహత్య! నిండుప్రాణాన్ని చేతులారా తియ్య

టమే అన్యాయం, అక్రమం, ఉద్రిక్తుడయి అమాంతం లేచి నిలబడ్డాడు.

గోడమీద ఎదురుగా గాంధీజీఫొటో కనబడ్డది. రెండు కళ్ళు ఫొటోమీద అతుక్కునిపోయినాయి. 'మహాత్ముడు' పెదిమలు తడబడ్డాయి. దారుణహత్యజరిగింది. న్యాయాన్ని, ధర్మాన్నీ ఖూనీచేశాడు హంతకుడు, కళ్ళు చెమ్మగిలినాయి, ఒళ్ళు తూలింది, కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. పూర్తిగా అలసిపోయాడు.

రమణ యిట్టే కనిపెట్టేశాడు, రాజావిషయమే ఆయన మనస్సు బాధిస్తోందని రమణనుచూసి, "వచ్చి యెంతసే పయిందీ" అన్నాడు భుజంగరావు. "ఇప్పుడే" అని సమాధానం యిచ్చాడు. "చంద్రం యింకా రాలేదేమిటి" అంటుండగానే- "అవునండీ యివ్వాళ కొంచెం ఆలస్యమయింది" అంటూ వచ్చి కూర్చున్నాడు చంద్రం.

టేబుల్ మీద రకరకాల జీవితాలు ఫైళ్ళల్లో అణిగి మణిగి పడివున్నాయి. కాలానికి కట్టుబడి కొన్ని, కాలదోషం పట్టి కొన్ని. ఏనాడైనా మళ్ళీ వెలుగునుచూస్తామా అనుకుంటూ తపనపడిపోతున్నాయి. భుజంగరావుగారి చేతుల్లోకి వెళ్ళంగానే ప్రాణాలు లేచివచ్చినట్లుంటుంది. భద్రంగా కోర్టు ఆవరణలోనికి వెళ్ళటం, మళ్ళీ యింటికివచ్చి అలమారలో దాక్కోవటం, కాగితాలసందుల్లోంచి తొంగితొంగి చూస్తున్నాయి.

చంద్రం ఆ ఫైళ్ళన్నింటినీ జాగ్రత్తగా పెట్టి, కట్టకట్టినట్టుగా తనముందు పెట్టుకున్నాడు. లాంఛనంగా కోర్టుకు వెళ్ళాలి. కేసు పేరు పెట్టి పిలిచినప్పుడు హాజరుఅవాలి. కేసు విచారణకు రాదు. ఏదో చిన్నపాటి సందేహం, కొద్దిపాటి సవరణ. అవతల వకీలు పెద్ద అప్లికేషన్ వ్రాసుకువస్తాడు. ఒకసారి సాక్షిరాడు, ఒకసారి తనకే వెళ్ళటంకుదరదు. కోర్టువారు ఏదోమిషతో కేసును అటో యిటో తేల్చివెయ్యరు. ఉభయు లకు తగినంత అవకాశంయిచ్చి, వాళ్ళవాళ్ళ వాదనలో బలాలు సన్నగిలేంతవరకు చూస్తారు! ఉభయులూ రాజీకి వస్తే చాలామంచిదే! కేసు పట్టుపోతుంది. మనస్సు విసుగు పడుతుంది. కాని న్యాయం చేకూర్చటానికే కోర్టువారుకంకణం కట్టుకునివుంటారు. ఏదిన్యాయం! ఏది అన్యాయం! చట్టాల్లో బిగించిన సూత్రాలప్రకారం తమకు చూపెట్టిన పరిస్థితుల దృష్ట్యా న్యాయమనేది నిర్ణయమవుతుంది. అది ఉభయులు వప్పుకుతీరాల్సిందే! ఒక్కొక్క ఫైలు తీసిచూస్తుంటేచంద్రం మనస్సు కలుక్కుమంటోంది. ఇవన్నీ యీరోజు విచారణకు వస్తాయని తోచదు. అట్టే ఫైలుతీసుకుని తీక్షణంగా చూస్తున్నాడు.

వరండాలోంచి ఓ పెద్దమనిషి గభాలున వచ్చిపడ్డాడు. భుజంగరావుగారితో తన కేసువిషయం ముచ్చటిస్తున్నాడు.

"రూల్సుకు వ్యతిరేకంగా ప్రిన్సిపాల్ ఎందుకు ప్రవ ర్తించాలి. అధికారం చేతిలోవుందికదా అని యిట్లా నిరం కుశంగా ప్రవర్తిస్తే, మనమే మెదలకుండా వూరుకుంటే యిక

సామాన్యులసంగతేమిటి చెప్పండి! ఆఁ ఏం లేదు. ఈయన హైకోర్టుదాకా వెళ్ళొచ్చాడా! అప్పటిమాట చూసుకుం దాంలే అనే ధీమే! అంతకంటె యేంలేదు” గట్టిగా చెప్తున్నాడు.

“చంద్రం! కాలేజీ ఎడ్మిషన్‌రూల్సు ఏమిటో చూసి. ఓ డ్రాఫ్ట్ వ్రాయి... అటువెళ్ళండి...” “అహా! ఇన్నాళ్ళ పట్టీ నడుపుతున్నారుగా ఫ్యాక్టరీ” అడుగుతున్నాడు భుజంగ రావు యింకో పెద్దమనిషిని.

“అదేం లేదండీ అయ్యగారు! నేను ఆ మంత్రిగారి గ్రూపు కాదని, నా లైసెన్సు రద్దుచేశారండీ అంతే!...”

పెద్దపెట్టున నవ్వాడు భుజంగరావు.

“ఇవన్నీ మనం మామూలుగా అనుకునే మాట లయ్యా! అసలు రూల్సు ఏమిటో తెలుసుకోక వట్టి కబుర్లు చెప్తే యెట్లాగు, ఈ ఏడు లైసెన్సు రెన్యూయల్ చేశావా...”

రమణ కల్పించుకున్నాడు.

“ఏమోనండీ అవన్నీ అబ్బాయే చూస్తాడు.”

“అయితే మీ అబ్బాయిని ఓసారి రమ్మను, అదేమి టో నేను చూస్తాన్లే.”

“చిత్తం!...” శలవుతీసుకున్నాడు.

“అవునండీ, నాకు రిలయబుల్ ఇన్‌ఫర్మేషనేవచ్చింది. రేపీపాటికి ఆర్డర్లుకూడా ప్యాసయి వస్తాయి! ఈలోగా మనం చెయ్యగలిగిందేమన్నా వుందా!” అని ఆలోచనగా అడిగాడు యింకొకతను.

"అంత మీ నాసైటీ సూపర్‌సీడ్ చేసేటట్లయితే దానికి తగిన వ్యవహారం నేను చేసిచూపిస్తాను. మీరేమి భయపడకండి" హుందాగా అన్నాడు భుజంగరావు.

"మీ రీపాటి ధైర్యంచెప్పినతర్వాత నా కింకేమి భయమండి" ఉత్తరీయం గభాలున బుజంమీద వేసుకుని చరచర సాగిపోయాడు.

"పెళ్ళిఅనేది ఒక పవిత్రమైన బంధం! మన ఉద్రేకాలకు,ఆవేశాలకు ఆ బంధం తెగిపోకూడదు. డైవోర్స్‌హక్కు వున్నదికదా అని మనం ఉపయోగించుకోవాలనే అభిలాష వుండకూడదు డైవోర్స్‌వక్టు ఒక చెక్ లాంటిది. దాన్ని చూస్తూ భయపడి, అనుబంధం పెంచుకుని, ఉభయులు అతి సన్నిహితులుకావాలి. కొన్నికొన్ని చట్టాలు యిందుకే ఉపయోగించుకోవాలిగాని, అమలుపరచటానికి కాదు" నిబ్బరంగా సఃహాయిస్తున్నాడు భుజంగరావు.

"మాకుమాత్రం యిది సుఖంటండీ! మా అమ్మాయి సుఖంగా కాపరంచెయ్యాలని వుండదా! అలాంటియోగ్యత లేకపోయిందే అని విచారిస్తున్నా. తప్పనిసరయి, యీ స్థితికి వచ్చాం." అన్నాడు ఆయన చాలా బాధగా.

"కోర్టుకుదిగటమనేది యేదైనా తప్పనిసరి అవుతేనే! అది నాకూ తెలుసు. చంద్రం! వివరాలేమిటో చూడు."

"నమస్తే!" అంటూ ఇద్దరువచ్చి కూర్చున్నారు. భుజంగరావు నమస్కారాన్ని స్వీకరించాడు.

"ఘోరమైన అన్యాయం జరిగిపోతోంది! నిలువ నీడ లేక కుటుంబాలన్నీ బజార్లోపడి మలమల మాడిపోతున్నారు.

ఉన్నసామానంతా బైటపడేశారు. ఇంత నిర్దాక్షిణ్యంగా పోలీసువారు చేస్తుంటే మనం చూస్తూ వూరుకోవాల్సిందేనా! దీనికేమైనా రెమిడీ వుందంటారా! ..." ఇంకా చెప్పటానికి ప్రయత్నంచేస్తుంటే మధ్యలో రమణ అడ్డంవచ్చాడు.

"ఎందుకుచేశారు!"

"మేమూ అదే అడుగుతున్నాం, ఇన్నాళ్ళపట్టీ శాంతియుతంగా జీవనంచేసుకుంటూ ఒకరి జోలికిపోకండా, తమ రెక్కలమీద బ్రతుకుతున్న యీ కూలీజనాన్నా తరిమి కొట్టటం! ఇవ్వాళ వా ళ్లెక్కడికిపోతారు? మీరే చెప్పండి! హఠాత్తుగా యిళ్ళు ఖాళీచెయ్యమని, చెయ్యకపోతే జబర్దస్తీగా వాళ్ళను యిళ్ళల్లోంచి బైటకునెట్టి వీధుల్లోపడెయ్యటము న్యాయమేనా? ధర్మమేనా! మానవత్వం అనిపించుకుంటుందా!" గొంతెత్తి ఘోష పెడుతున్నాడు.

"పాకలు వాళ్ళువేసుకున్నవేనా?" ఇక కేసువివరాల్లోకి మెల్లిగా దింపుతున్నాడు రమణ.

"అవును, రాత్రింబవళ్ళు కష్టపడి వాళ్ళే వేసుకున్నారు."

"ఆ స్థలం యెవరిది అసలు!"

"ఆఁ అది వూరికెనేవుంది. చాలారోజుల్నుంచి ఖాళీగానే పడివుంది. ఎవ్వరిదీ కాదు."

"ప్రభుత్వంవారిదా కాకపోతే?"

"ప్రభుత్వంవారిదిమాత్రం కాదు. అది మేము కనుక్కున్నాం."

"అయితే యెవరిస్థలంలోనో వెళ్ళి వీళ్ళు పాకలు ఎట్లావేసుకున్నారండి."

"అయితే చావమంటారుటండీ! పేవ్‌మెంట్లమీద ఎన్నాళ్ళు జీవితాలు గడపమంటారు! మీ రొకసారి వచ్చి చూడండి మీకే తెలుస్తుంది. గుండెలు తరుక్కుపోతాయి." ఉద్రేకంగా అంటున్నాడు హట్స్‌యూనియన్ పెద్ద.

"అదిసరేలెండి, దాని కో ఉపాయం ఆలోచించాలి! మీరు కాస్త వరండాలో కూర్చోండి మళ్ళీ పిలుస్తాను." సర్ది చెప్పి సాగనంపాడు ఎట్లాగయితేనేం వాళ్ళను రమణ.

"నమస్తే!"

"ఎప్పుడొచ్చారు!" కొంచెంగా లేవబోయాడు భుజంగరావు.

"నమస్తే" అన్నాడు రమణ. ఆ వచ్చిన పెద్దమనిషికి చంద్రాన్ని పరిచయంచేయటంకూడా జరిగింది. పెద్ద మోతు బరి. పట్టుదలమనిషి. అనుకున్నతర్వాత చేసేదాకా నిద్ర పోడు.

రెండుక్షణాలు మౌనంగా వూరుకున్నారు.

"మేరేజి ఇన్‌వాలిడ్ చెయ్యటానికి వీల్లేదన్నారు గారూ!" ఆలోచనగా భుజంగరావువంక చూశాడు.

"ఊఁ"

"అయితే డైవోర్స్ యిప్పిస్తే!"

"ఏ గ్రౌండ్స్‌మీద?" చప్పున అన్నాడు రమణ.

"అవికూడా మేమేచెపితే, యింకా మీ రెందు కయ్యా!" పక్కున నవ్వాడు ఆ పెద్దమనిషి.

చంద్రం, భుజంగరావులు ఒకరిమొహం ఒకరు చూసుకుని మెదలకండా వుండిపోయారు.

"వాడి కా బుద్ధేమిటి చెప్పండి! మా కులంలో అంత అందమైనపిల్ల లేదనా ఏమిటి! ఒళ్ళు పొగరు! లవ్ వకటి వచ్చిపడింది, దానికి హద్దుల్లేవు. అసలు నన్నడుగుతే, ఆ లవ్ మీదకూడా ౧౪౪ సెక్షను అమలు చెయ్యాలి. లవ్‌ను క్లియర్ టరమ్స్‌లో డిఫైన్ చేస్తూ అదేం కులమో, అదేం జాతో మనకు తెలీదు." ఉడికిపోతున్నా డాయన.

"ఇంటికి తీసుకువచ్చాడా!" మెల్లిగా అడిగాడు రమణ.

"ఇంటికి తీసుకురావటమా!... నేను బతికివుండగానే!... గడపలో అడుగుపెట్టావంటే షూట్ చేస్తానని చెప్పా! మా వాడసలు డైవోర్సుకూడా వప్పుకోడులెండి. పైగా నే యింకోటి విన్నా... వాడు పార్టీషన్ దావా వేద్దామనుకుంటున్నాడుట. చూస్తాను నేనూ ఎంతవరకుపోతాడో! ఏవిధంగానైనాసరే వాడికి చిల్లిగవ్వకూడా దక్కకుండా చెయ్యాలండీ!" హుంకరించాడు.

తలవూపుతూ అన్నీ వింటూ కూర్చుంటాడు భుజంగరావు.



# 2

గుండ్రటి భూమిని ఓ చమత్కారుడు రంగులు రంగులువేసి ఓ బంతిఆకారంలో తయారుచేసి రెండు రేకుల సందున బిగించేశాడు. సరదాకొద్దీ భుజంగరావు కొనుక్కుని తన టేబుల్‌మీద పెట్టుకున్నాడు. దానివైపుకు వరిగి కుడి చెయ్యి చూపుడువేలుతో గిరగిర తిప్పుతున్నాడు. ఒక్క చుట్టు తిరిగివచ్చేటప్పటికి మళ్ళీ హిందూదేశమే కనబడు తోంది. అదేపనిగా తిప్పుతూ అట్టే పరీక్షిస్తున్నాడు. ఇంత వేగంగా తిరుగుతున్నా యిక్కడినుంచి ఒక్క అంగుళం కూడా కదల్లేదే అనుకుంటున్నాడు. అయితే దీనిఅర్థం యేమిటి? భూమికూడా వేగంగా తనచుట్టూతాను తిరు గుతూ సూర్యునిచుట్టూ తిరుగుతోందంటారు. కాని మన కేమీ తెలియటంలేదు. ఆశ్చర్యంగానేవుంది. గ్రహాలైనా మానవులైనా ఒకటే! నిత్యమూ చేస్తున్నది యెవరిచుట్టూ వాళ్ళు తిరగటమే! పైగా యింకొకరిచుట్టూకూడా తిరు గుతూ వుంటారు. ఇదొక సృష్టిక్రమము. మానవుడు ఊరికే కూర్చోలేడు. నిత్యమూ తిరుగుతూ ఉండాల్సిందే! బంతిని యింకా వేగంగా తిప్పుతున్నాడు నవ్వుకుంటూ.

వస్తున్న రమణవైపుకు తలెత్తి చూశాడు భుజంగ రావు.

"ఏమిటి అట్లావున్నావు" అన్నట్లు కళ్ళతో ప్రశ్నిం చాడు.

"అబ్బ! తిరిగితిరిగి వస్తున్నానండీ" అంటూ కుర్చీలో కూలబడ్డాడు రమణ. వింతగా నవ్వాడు భుజంగరావు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్ ?..."

"నేనా ఆలోచించాలసినవాణ్ణి ? నా కేమున్నాయని ఆలోచిస్తాను ?..." చప్పున అన్నాడు రమణ.

"అంత రికామీగా వున్నావని నే ననుకోటల్లేదు..."

"ఏమైనా మీ కున్న వ్యాపకాలు నాకున్నా యంటారా ?..."

"ప్రతివ్యక్తికి ఒకేరకపు వ్యాపకాలుంటాయని మన మెందుకు అనుకోవాలి ?..."

"అవును నిజమే ! అయితే మిమ్మల్ని యెవ్వరూ యేమీ అడగరు ! కొన్ని కొన్ని ప్రశ్నలకు ఏమిసమాధానాలు చెప్పాలో అర్థంకాక సతమతమవుతూవుంటా !... కొన్ని నమ్మలేనివిషయాలు అడుగుతూవుంటే నీకే ఆశ్చర్యమేస్తుంది. ఏమైనా ఈ వయస్సులో నాకు వృద్ధాప్యంవచ్చిందనే అనుకుంటున్నా" అన్నాడు రమణ బింకంగా.

"అది ఒక్కొక్కరి మనస్తత్వంమీద ఆధారపడి వుంటుంది. వయస్సు అనేది కేవలం కాలంయొక్క కొలత కాదు..."

"మీరు ఎన్నైనా చెప్పకలుగుతారని నాకు తెలుసు. మీతో వాదానికిదిగాలని నేను ఎప్పుడూ అనుకోలేదు' సరే, ఆవిషయం అటుంచండి. పిల్ల పెళ్ళివిషయంలో అక్క

గారు తొందరపడుతున్నారు..." అంటూ రమణ లేచి నిల బడ్డాడు.

"అవును..."

"నన్ను చెప్పమంటూ కూర్చున్నారు. నేను ప్రత్యే కంగా మీకు చెప్పాలసిందేమీ కనుపించటంలేదు."

"ఏమన్నావుంటే చెప్పు. తప్పేముంది ?.. "

"చెపుతాలెండి. చెప్పకేం! మీకు నేను, నాకు మీరు చెప్పకపోతే, యింకెవ్వరు చెపుతారు !..." కొంచెంగా నవ్వుతూ అన్నాడు రమణ.

"ఈ రాజా ఖూనీ కేసు వచ్చినప్పటినుంచీ, చంద్రం చాలా ఇంటరెస్టు చూపిస్తున్నాడు. దీంతో అతనికి క్రిమినల్ కూడా పూర్తిగా అర్థమయిపోతుందిలెండి ..." మళ్ళీ అందుకున్నాడు రమణ.

"ఏదైనా యిట్టే గ్రహించేస్తాడులే. చురుకుగల వాడే! ..." సంతృప్తిగా అన్నాడు భుజంగరావు.

"అందులో సామాన్యమైన చురుకు కాదు... కాస్త వాడికూడా! ..."

"అంటే! ..."

"ఏమీలేదు; యువకుడు, ఒంటరిగాడు !..."

"ఏమిటో నీమాటలు ! చాలా బుద్ధిమంతుడులాగానే వున్నాడు..."

"పైకి కనిపిస్తున్నంత అమాయకుడు కాదేమో నని !..."

"పైకిమాత్రం ఏమంత అమాయకుడుగా కనుపిస్తున్నా డని !..."

"సరిపోయింది. మీకు పైకికూడా కనిపించటంలేదా? మొత్తంమీద గంభీరమైన మనిషి. తోణకడు ... కాస్త చెక్క వున్నట్టేకనిపిస్తోంది. ఏమీ వెనకాల లేకపోతే ఈ ప్రొఫెషన్‌లోకి ఏమిబావుకుందామని వచ్చినట్టు ?..."

"అదేమన్నమాటలే. కేవలం వున్నవాళ్ళే ఈ ప్రొఫెషన్లోకి వచ్చినట్లయితే, యిన్ని కోర్టులకు అవసరం వుండేది కాదేమో ?..."

"అంతేలెండి. ఎవరిఅదృష్టం ఎలా వుంటుందో ఎవరికి తెలుసు? ప్రయత్నంచెయ్యటం మన విధి. అన్నట్టు భక్త సమాజంవారు తిరిగి వెళ్ళిపోతున్నారు. మీ రేమన్నా యిస్తామని చెప్పారా !..."

"వాగ్దానాలు ఏమిటిదీంట్లో? ఏదో యిచ్చి పంపించేసెయ్యి ! చూశావా ! కేశవరావు డబ్బు పంపనేలేదు..."

"అందుకనే ముందరే డబ్బుతీసుకోమంటే మీకేమో గిట్టందేను !...

"చూస్తూ చూస్తూ మనం ఎట్లా అడుగుతామయ్యా, ఫీజ్ సెటిల్ చేసుకున్నతర్వాత, యివ్వాలసినబాధ్యత వాళ్ళమీద వుంటుందికాని మనం అడగటంలో గొప్పతనం ఏమిటి ?..." హుందాగా అన్నాడు భుజంగరావు.

"వాళ్ళబాధ్యత వాళ్ళు నిర్వర్తించుకోకపోతే మనం గుర్తుచెయ్యద్దటండీ ?..."

"మన ఆడుర్దాకొద్దీ అనుకోటమేకాని, వాళ్ళు ఎప్పుడూ అంతే, మనం అడిగినా, అడక్కపోయినా ఒకటే తీరు! అయినా యింకా మించిపోలేదనే అనుకుటుంన్నా చూద్దాం," అంటూ తలవూపాడు.

"అయిపోయినదానికేమి ఫరవాలేదులెండి, ముందు ముందైనా, జాగ్రత్తగావుంటేనే మంచిది. మన మంచితనం చూసి, దురుద్దేశంతో చాలామంది వస్తూవుంటారండి!..."

"పోనీలేవయ్యా! మనవలన నలుగురు బాగుపడితే అది మంచిదేగా మనకు!...."

"వాళ్ళు బాగుపడటంమాట అటుంచండి. మనకు నష్టంరావటంలా?..."

"భుజంగరావు ఏమీ మాట్లాడలేదు. ఆయనవంక చూసి, రమణ యింకా ముందుకుసాగటానికి ఉద్యుక్తుడవుతున్నాడు. ఇద్దరూ ఒకరిమొహం ఒకరు చూస్తూ నిలబడిపోయారు.

"మీరు కాలువప్రక్కన కొన్న స్థలంవిషయం అక్కగారికి తెలిసింది!..." చాలా నిబ్బరంగా అన్నాడు రమణ.

"ఆ విషయం నీ కొక్కడికే తెలుసని అనుకున్నా!..."

"అక్కగారికి నేనుచెప్పలేదు! నాకూ ఆశ్చర్యంగానే వుంది. ఏవో మాటలసందర్భాన కష్టంగా నాతో అంటే నేను ఏమీ అనలేకపోయాను. నేనూ బాధపడ్డాను ..."

"దేన్ని గురించి !..." గంభీరంగాచూశాడు భుజంగ రావు.

"అక్కగారికి తెలిసిందే అని!..." తప్పించ సమాధానం యిచ్చాడు రమణ.

ఆయనేమి మాటాడలేదు.

"నేను మీకు చెప్పాలసినవాణ్ణికాదు. అయినప్పటికీ చనువుతీసుకొని అంటున్నమాటలను వేరేవిధంగా భావించ కండి! మీముందర మిమ్మల్ని పొగడుతూ చాటుగా అనేకం అంటున్నవాళ్ళు నాకు తెలుసు !..."

"అది లోకసహజం !..."

"కనీసం వాళ్ళకు అలాంటిఅవకాశం యివ్వకుండా మనం మనజాగ్రత్తలో వుండటంకూడా అవసరమను కుంటాను !..."

"ఎవరో ఏదో అనిపోతారని నా ఆత్మను నేను చంపుకోలేను. నేను ఒకర్ని మోసంచేయటంలేదు. ద్రోహం చెయ్యటంలేదు. జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవించటానికి ప్రయత్నంచేస్తున్నాను. అంతే! నన్నుచూసి ఓర్వలేనివాళ్లు ఎన్నైనా అంటారు. నా సుఖాన్నిచూసి సహించలేనివాళ్ళు ఏమైనా భావిస్తారు! దానికి నేను బాధ్యుణ్ణికాదు. ప్రతి వ్యక్తికి పైకిచెప్పలేని కోరికలు అభిలాషలు వుంటాయి. కొంతమంది వాటినితీర్చుకోకలుగుతారు. తీర్చుకోలేనివాళ్ళు అసూయపడటం సహజం! నేను అలాంటివాళ్ళనుచూసి

జాలిపడతాను! నేనుచేసేపనుల్లో యేదిమంచి యేదిచెడు అని నిర్ణయించుకోవాల్సింది నేనే. అది ఇతరులుచేసే పని కాదు ..." నిబ్బరంగా అన్నాడు భుజంగరావు.

"అయితే పేరు..." చెప్పబోతుండగానే రమణను చప్పున ఆపేశాడు.

"నీకు తెలియవనుకున్నవిషయాలు తెలుసుకున్నావు. దానివలన నాకువచ్చిన బాధేమీా లేదు. అయితే నీకుతెలిసి నట్లు నాకుచెప్పటంలో నాకు వచ్చిన సుఖమేమీా లేదు."

మెదలకండా వూరుకున్నాడు రమణ. కాని బాగా కోపమూవచ్చింది. తమాయించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఒకవైపేమొ గట్టిగానే సమాధానంచెపుదా మనుకుంటున్నాడు.

"మంచి చెడుగుల నిర్వచనాలు చేయగలఅనుభవం మనం సంపాదించా మనుకుంటాను." అన్నాడు రమణ కాస్త గంభీరంగానే.

మనకున్న అనుభవాన్నిబట్టి మంచి చెడుగులు నిర్ణయంకావు. ఏదిమంచి! ఏదిచెడు! ఎవరిఅనుభం ఎవరికి ఉపయోగపడిందికనక! మన అనుభవాలు యితరులకు ఉప యోగపడుతుం దనుకోవటానికి! ఇతరుల అనుభవాలమీాద నాజీవితాన్ని కొనసాగించుకోవటానికి నేను యిష్టపడను. అట్లాగే నా అనుభవాలు యితరులమీాదరుద్దటానికి ప్రయ త్నించను. స్వానుభవంకావాలి. జీవితంఅంటే ఏమిటో తనం

తట తాను తెలుసుకోవాలి. లేనిపోని కట్టుబాట్లను సృష్టించుకుంటూ వాటిమధ్యనే నలిబిలవుతూ ఆత్మవంచనచేసుకుంటూ శరీరసౌఖ్యంలేకుండా ఎప్పుడో ఓనాడు ఆకు రాలిపోయినట్లు రాలిపోవటం నాకు యిష్టంలేదు. నేను చేస్తున్న పనులను అరికట్టటానికి పూనుకోవాలని తాపత్రయపడద్దు. ఈ జీవితం ఎట్లా వెళ్ళిపోవాలో అట్లాగే వెళ్ళిపోతుంది. మధ్యలో శాసనలు అక్కర్లేదు" గంభీరంగా అన్నాడు భుజంగరావు.

"లోకానికి ఏది తెలిసినా నేను చెప్తున్నానని దురభిప్రాయ పడరనిమాత్రం అనుకుంటాను." పెదిమలు చప్పరిస్తూ గబగబ రమణ వాకిట్లోకి వెళ్ళిపోయాడు.

భుజంగరావు రూములో అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. శరీరం పెంచుకున్నాడు. కళ్ళు రెండూ ఎర్రబడ్డాయి. ఒళ్ళు వేడెక్కింది. మహాతపనగా చకచక తిరుగుతున్నాడు. కాసేపు ఆరాటపడ్డాడు. దభాలున అద్దంముందు వెళ్ళి నిలబడ్డాడు. అద్దంలో తనబొమ్మఒక్కటే కనిపించలేదు. ప్రక్కనే వాగేశ్వరి వున్నట్లుకూడా కనిపించింది. చప్పున వెనక్కుతిరిగాడు భర్తనుచూడంగానే ఆమె విలవిలలాడిపోయింది. చేతులూ, కాళ్ళూ కంపించినాయి. ఇంత రౌద్రంగా భర్తను ఎన్నడూ తాను చూసినట్లు గుర్తుకు రావటంలేదు. వణుకుతూ వెనక్కు వెనక్కు వెళ్ళిపోతోంది. ఆమె వెనక్కు వెళుతున్నకొద్దీ భుజంగరావు ముందుకు అడుగులు వేస్తున్నాడు. ఆమె ఆయనముందర నిలబడలేక చకచక వెళ్ళిపోయింది.

భుజంగరావు దుబారాగా ఖర్చుపెడుతున్నాడని, అనవసరమైన వ్యక్తులకు డబ్బుయిస్తున్నాడని, దీంట్లో అంతరార్థం యేదో వుండితీరుతుందని రమణకు గట్టి నమ్మకం, వాగేశ్వరికి అనుమానం. ఆమె అక్కడయిక్కడా విని ఇంటికి వచ్చి తీవ్రంగా బాధపడుతుంది. తనభర్తనుగురించి యిన్ని పొగడ్తలు వింటున్నప్పుడు గర్వపడినట్లే ఆయననుగురించి చెడుగా వింటున్నప్పుడు బాధపడుతూనే వుంటుంది. అంతకంటె ఆమె చేసేదేమీ లేదు. ఇలాంటివిషయాలు పైకి యెవ్వరితోనూ అనేవికావు. ఎప్పుడైనా సమయంచూసుకుని, భర్తతోనే ముచ్చటించి, తన ఆవేదనను సర్దుబాటుచేసుకోవాలి. అలాంటి అవకాశం యెన్నడోకాని చిక్కదు. అయితే సూచనగా రమణతోమాత్రం తన మానసికబాధ చెప్పక తప్పిందికాదు. కాని రమణకూడా సూటిగా భుజంగరావును 'యిదేమిటీ' అనే స్థితిలోలేడు. ఆయన మనోభావాల్ని కని పెట్టి తగినట్లుగానే మాట్లాడి చక్కావచ్చేస్తాడు. తాను యెన్నో అడుగుదామనుకుని సంభాషణల్లోకి దింపిన రమణ, భుజంగరావు ఏమీ అవకాశం యివ్వకపోయేటప్పటికి, యేమీ అడక్కుండానే వెళ్ళిపోయాడు.

భుజంగరావును అర్థంచేసుకోవటంమహాకష్టం. ఆయన వేసే ప్రతి అడుగులోనూ అర్థంవుంది. మాట్లాడేమాటల్లో చమత్కారం వుంది. చేసేపనుల్లో అంతరార్థం వుంది. ఏ ఆలోచనా లేకండా ఏపనీ చెయ్యడు. తన ఆలోచన భగ్నమయినా, ఆ అసంతృప్తి యితరులకు తెలియచెయ్యనీయడు. ఇదే ఆయనలో ప్రత్యేకత. నిండైనవిగ్రహం. కాస్త లావు

కూడా. వత్తుగా పెంచుకున్న మీసాలు గంభీరంగా కొట్టవచ్చి నట్టు కనిపిస్తాయి. నల్లకోటు తొడుక్కొని, తలపాగ పెట్టుకుని, చేతికర్ర ఊగించుకుంటూ వస్తుంటే, ఆయన్ని చూసి ఎవ్వరూ నోరుమెదపలేరు. చెపుదామనుకున్న విషయాలుకూడా యిట్టే మరిచిపోతారు. ఆయనంటే ఎందుకో చెప్పలేని భయమూ, బెరుకూను. ఆయనకూడా యెంతో బింకంగానూ, రహస్యంగానూ వుంటాడు. ఆ గుంభనలోనే ఆయన హోదా కనిపిస్తూవుంటుంది.

రమణ ఏమేమి అడగటానికివచ్చాడో యిట్టే తెలుసుకున్నాడు. చంద్రం ప్రస్తావన యెందుకు తెచ్చాడో కూడా యిట్టే పసికట్టేశాడు తన ఉద్దేశం ఆయనకు తెలియటం యిష్టంలేదు. అందువలననే సూటిగా దేనికీ సమాధానం చెప్పకండా అన్నిటినీ దాచేశాడు. తన ఆలోచనల కన్నింటికీ ఓ రూపుతీసుకురావటానికి నిబ్బరంగానూ ఏమీ పట్టించుకోనట్టుగానూ ప్రవర్తిస్తూనే ప్రయత్నాలు చేస్తూవుంటాడు. ఆయనమనస్సు తెలుసుకోవటం మహాకష్టం. ఆ నాడల్లా ఆయనదగ్గరకు వెళ్ళటానికే భయమేసి ఊరుకున్నారు. పిల్లలు అడిగినాకూడా వాగేశ్వరి సరియైనసమాధానం యివ్వలేకపోయింది.

"కమలా! అక్కయ్యొందా!" స్వర్ణలోపలికివస్తూనే అడిగింది.

"ఏమోమరి..." చికాకుగా సమాధానంచెప్పింది కమల. ప్రక్కగదిలో చదువుకుంటున్న అఖిల గభాలున వచ్చింది యీమాట విని.

"లోపలేవున్నాన్! మరి నాకు తెలీదాటుందే కమల!" విసుగ్గాఅన్నది స్వర్ణ.

"మధ్యమధ్య దానికి తలతిక్క పుడుతుందిలే." అక్క సుగా అంది అఖిల.

"నువ్వు లోపలున్నావని కలగన్నానా! తలతిక్కట! తలతిక్క..." కమల కోపంగా అక్కవంకచూసింది.

"స్వర్ణ ఓమూల అడుగుతుంటే నేను ఉన్నానో లేనో చూడాలసినబాధ్యత నీకు లేదా?"

"ఏమో, నువ్వింట్లోవున్నావని నాకేం తెలుసు! పుస్త కాలు పట్టుకుని బయలుదేరితే ఎక్కడికో వెళ్ళావనుకున్నా!" చర్రున లోపలికివెళ్ళింది కమల.

"మూశావా ఎట్లా మాట్లాడుతోందో?"

"ఎందుకని, ఏమన్నా అనుకున్నారా?"

"ఏముంది ఇవ్వాళ మాఅమ్మ బాగా చివాట్లుపెట్టిం దిలే, ఏమీ చేతకాక ఆ కోపంఅంతా నామీదచూపిస్తోంది. ఇంట్లో ఒక్క పని చెయ్యదు. పైగా అథారిటీచేస్తుంది. ఎక్క డెక్కడికి వెళుతుందో వెళ్ళివస్తుంది. మాఅమ్మ అడుగుతే మొద్దులాగ మాట్లాడదు. మానాన్నగారు ఏమీ అనరు. అదీ అసలు అలుసు" తన కోపాన్నంతా వెళ్ళగక్కింది.

స్వర్ణ నిశ్చలంగా వింటూ మెదలకండా వూరుకుంది.

"నాకు బలే చిరాకుపుడుతోంది స్వర్ణా! నిజంచెపు తున్నాను, కమల దతి నాకేమీ బాగాలేదు!"

"మీ యిద్దరూ యెంతో సఖ్యతగావుంటారని నలు గురూ చెప్పుకుంటుంటే. యింట్లో యిదావరస మరి! ఎవరి

కైనా తెలిస్తే అసహ్యంగావుండదూ! ఇంతవరకు మీరు మాటామాటా అనుకున్నట్లు ఎప్పుడూ నేను చూడలేదు. నాకూ ఆశ్చర్యంగానేవుంది!"

"ఏం చెయ్యమంటావ్ చెప్పు. నాకూ ఆశ్చర్యంగానే వుంది! కమల అట్లా తయారయింది. అదివరకుమాదిరిగా లేదు. ప్రతివిషయం వికటంగా మాట్లాడుతుంది. చెప్పినమాట ఒక్కటీవినదు. అదిచేసేపని నాకు ఒక్కటీ నచ్చదు. అన్నీ వ్యతిరేకమే!"

"ఇంతయిదిగా నువ్వెప్పుడూ మాట్లాడేదానివిగాదే!"

"ఏమోమరి! నీకే తెలియాలి."

"సరేగాని, రాత్రి చాలాసేపు మేలుకున్నావా!"

"ఏమోనమ్మా! రాత్రి అసలు చదువు సాగనేలేదు. పోర్షన్ చూడబోతే బోలెడంతవుంది. ఎప్పుడు పూర్తిఅవు తుందో ఏమో! భయమేస్తోంది తలుచుకుంటుంటే. ఈ ఏడు పరీక్ష పేపర్లు బాగా స్టిఫ్‌గా వుంటాయంటకూడా."

"నాకూ ఏమీ చదువు సాగలేదు. పుస్తకం ముట్టు కోంగానే నిదరవచ్చింది. పడుకున్నాను అంతే!"

"మనిద్దరం బాగానేవున్నాంలే అయితే యీయేడు అయినట్టే!" నవ్వింది అఖిల.

"అట్లాఅని వూరుకుంటే ఎట్లాగు! మా నాన్న వస్తు న్నారు." స్వర్ణ తండ్రివైపు చూసింది.

"రాత్రి చూడపోతేనేమొ. దీపాలుపెట్టంగానే నిద్ర పోతావు, ఇప్పుడేమొ యిక్కడికొచ్చి కబుర్లుచెప్తున్నావ్. మీరు చదివేదెప్పుడు!" వచ్చి రావటంతోనే రమణ నడుం

మీద చేతులు పెట్టుకుని యిద్దరివంకా చూశాడు.

"లేదు నాన్నా! చదువుకుంటాం."

"అన్నగారూ!" అంటూ మెల్లిగా వాగేశ్వరివచ్చింది.

"అమ్మా! అమ్మా! అక్కయ్యకొట్టిందే!" కళ్ళునలుపు కుంటూ బోసు వచ్చాడు తల్లి దగ్గరకు

"వాళ్ళు తయారయ్యారుగా! ఇంకా మీరుకూడా తయారుకండి" విదలించేసింది వాగేశ్వరి. చిన్న మొహం చేసుకుని లోపలికి వెళ్ళాడు.

"అయిందా! అమ్మతో చెప్పటం అయిందా!" బోసు లోపలికి వెళ్ళంగానే జ్యోతి వెక్కిరిస్తోంది. బోసుకు యింకా ఉక్రోషం వచ్చిపడింది. కొంచెం బిగ్గరగా ఏడుపు మొదలు పెట్టాడు. తానుకూడా ఏడుస్తున్నట్లు జ్యోతి ఎగతాళి చేస్తోంది.

గభాలున రమణ, వాగేశ్వరి యిద్దరూ లోపలికి వచ్చారు. వాగేశ్వరి మండిపడింది. ఆమె తనకోపాన్నంతా కొడుకూ, కూతురిమీద చెరిసమానంగా పంచేసింది.

"పసిపిల్లలు, వాళ్ళను కొడతారేమిటండీ!" అంటూ వారించబోయాడు రమణ.

"మీకు తెలీదు ఊరుకోండి ఇప్పుడు విచ్చలవిడిగా వదిలేస్తినే రేపు నెత్తినెక్కి కూర్చొనేది! చూడటంలా యిప్పుడు?"

చురచురమంటూ చూస్తూ, కమల విసురున అక్కడి నుంచి వెళ్ళిపోయింది. పట్టుబలవంతంగా తమాయించుకుని వూరుకుంది వాగేశ్వరి.

"బొంబాయి ఎందుకువెళ్ళినట్టు? మీ కేమన్నా తెలుసా?" అమాంతం ఓ ప్రశ్న వేసింది.

"నాకూ బాగా తెలీదండీ! ఎవరో ఒకాయన టెలిగ్రాం యిచ్చాడు రమ్మనమని. అంతే." తడబడుతూ అన్నాడు రమణ.

"మీరుకూడా అట్లాఅంటే యెట్లాగండి!" గట్టిగానే అన్నది.

"ఏంచెయ్యమంటారు చెప్పండీ! వారంతటవారు బుద్ధి పుట్టి ఏదైనా చెపితే వినటమేకాని, నేను అడిగి తెలుసుకునే రోజులు పోయినాయి. నన్ను యింతకంటె ఏమీ అడక్కండి!" గంభీరంగా అన్నాడు.

"నాకేమి అర్థంకావటంలేదు!"

అర్థమయ్యేందుకు యేముంది! నలుగురితో పాటు నేను కూడా ఒకణ్ణయిపోయాను. కాని లోకంనమ్మదు. నాకూ వారికీ వున్న సన్నిహితత్వాన్నిచూసి, నేను ఏదిచెప్పినా లోకం నమ్మదు. వారు చేస్తున్న ప్రతిచిన్నపని నాకు తెలిసే వుంటుందని మీరుకూడా అనుకుంటే నేను చెప్పేదేమీ లేదు."

"అందాకా వచ్చిందన్నమాట!"

"మీరు అనవసరంగా ఆందోళనపడకండి. బొంబాయిలో కేసుకూడా ఒకటి వుందిలెండి."

"నా సంతృప్తికోసం చెపుతున్నమాటలా!"

"కాదు, నిజం చెపుతున్నాను."

"ఏమన్నా డబ్బుకూడా తీసుకువెళ్ళారా?"

"ఊఁ."

"చెప్పండి."

"అవును. బ్యాంకుకు వెళ్ళారు. కొంతడబ్బు తీసుకు వెళ్ళినట్టు అనుమానంగా వుంది. ఎంత తీసుకువెళ్లారో తెలుసు కోవటానికి నేను ప్రయత్నం చెయ్యలేదు."

"మీరు నిజంగా చెప్పండి. కేసుమీద బొంబాయి వెళ్ళినప్పుడు డబ్బు తీసుకువెళ్లాలిసిన అవసరంఏమిటి?"

"ప్రతివిషయాన్నీ ఆవిధంగా ఆలోచిస్తే మనకు సరియైనసమాధానం దొరకదు. అనుమానాలతో ఆలోచించ కండి డబ్బు అవసరంవుంటుందని అనుకుంటే సరిపోలేదు?"

"పరిస్థితుల్నిబట్టి అనుకోవలసివస్తోందిగాని వారిని అనుమానించటం, నాకు సంతోషమంటారా!" మాటలో గీరవచ్చింది.

"లేదులేదు" అనుకున్నాడు మనస్సులో.

"ఎంతో బింకంగానూ, గంభీరంగానూ వుండేమనిషి యివ్వాళ యేమిటో తేలిపోతోంది. ఎంతో మానసికంగా బాధపడితేనేగాని యింతగా బైటపడదు పాపం వాగేశ్వరి" అనుకున్నాడు.

"జ్యోతీ! నువ్వాగదిలోకి వెళ్ళమ్మా! నువ్వుకూడా!" బోసువంకకూడా చూశాడు రమణ.

ఇద్దరూ బిక్క మొహంవేసుకుని తల్లివైపుకు బెరుకుగా చూస్తూ వెళ్ళిపోయారు.

"రాసిండి అడగాల్సిందేమిటో అడిగేస్తాను."

"వద్దండి వద్దు, తొందరపడకండి. వారిమనస్సు బాధ

పడుతుంది. ఆయనకున్న గౌరవప్రతిష్టలు, యీ చుట్టుపక్కల మెవ్వరికీ లేవు. ఆయనొక గొప్పవ్యక్తి. నిరాడంబరమైన మనిషి. ఎన్నోవిషయాలు కడుపులోదాచుకుని నిబ్బరంగా పైకి కనిపించగల గంభీరమైన మనిషి. ఆయనమనస్సులో యేముందో తెలుసుకోవటం కష్టం. అంతటివ్యక్తి బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నారని మనం అనుకోవటంకూడా చాలా తప్పు!" పూర్తిగా ఆయాసపడిపోయాడు రమణ.

"క్షమించండి, తప్పునాదే! అడదాన్ని లోపలఆవేద నను అపుకోలేక ఏమేమిటో అనుకున్నాను. అలాంటివారిని గురించి ఏమనుకున్నా దోషం నాదే!" పెద్దగా నిట్టూరుస్తూ రెండువేళ్ళతోనూ రెండుకళ్ళు అద్దుకుంది.

"పంతులుగారు గొప్పజాతకుడు. అశేషమైన కీర్తిప్రతి ష్టలు గడిస్తారు. వారిజీవితంలో వారిమాటకు ఎదురుండదు. ఇది లోపమని ఎన్నడూ అనుకోగు. పదిమందిలో తలెత్తుకుని తిరగగలశీవి ఆయనకే దక్కుతుంది. ఆయననుచూసి ఓర్వ లేనివాళ్ళను, సహించనివాళ్ళను కళ్ళతోఆకట్టేస్తాడు. ఆయన ముందు నిలబడి ఎవ్వరూ నోరు మెదపలేరు. ఆయనలాంటి జీవితం లక్షమందిలో ఏఒక్కరికో లభ్యమవుతుంది. గొప్ప అదృష్టజాతకుడు. ఆయన్నుగురించి యింకేమికావాలో అడ గండి." తొణక్కుండా చెప్పేశాడు రమణ.

"చాలు చాలు. నాకు కావాలసింది అదే! ఇది కన్నీరు కాదు. ఆనందబాష్పాలు" కళ్ళురెండూఅద్దుకుంటూ "మిమ్మల్ని ఎన్నాళ్ళబట్టో అడగాలనుకున్నవిషయాన్ని,

మీఅంతటమీరే చెప్పారు! నాకు చాలా సంతోషంగా వుంది." బరువైనహృదయం తేలికయినట్లుంది.

తెగ ఆయాసపడిపోతున్నాడు రమణ. కళ్ళు నిశ్చలంగానిలిపి ఆయనఫోటోవంక అదేధ్యాసతో చూస్తున్నాడు. మొహమంతా చెమటబిందువులువచ్చి చేరినాయి. మొహం గంభీరంగా మారిపోతోంది. శరీరంలోకి కొంచెంగా వణుకు వస్తోంది. కదలక మెదలక కూర్చునిపోయాడు.

"అన్న...గారూ!" ఎంతో ఆవేదనగా పిలిచింది వాగేశ్వరి.

చప్పున త్రుళ్ళిపడి, తలవిదిలించేసుకుని 'ఆ!' అంటూ ఆమెవైపుకు తిరిగాడు. తనశరీరం వెచ్చగ తగిలింది.

"ఏవండీ..." ఆదుర్దాగా లేచి నిలబడింది వాగేశ్వరి.

"ఏమీలేదు, ఏమీలేదు." ఒళ్ళంతా ఉత్తరీయంతో గట్టిగా తుడుచుకున్నాడు రమణ.

పిల్లలునలుగురూ గదిగుమ్మందగ్గర నిలబడివుంటం చూసి, "ఇక్కడేం చేస్తున్నారు! ఓమూల పరీక్షలొస్తుంటే చదువుకోరాదూ?" అంటూ రమణ చకచక భుజంగరావు గారి రూములోకి వెళ్ళిపోయాడు.



# 4

"అమ్మాయి! తలుపుతియ్యమంటుంటే ఏమిటా మొండితనం." తలుపులు గట్టిగా తట్టింది వాగేశ్వరి.

గదిలోపలకూర్చుని చిన్నపిల్లలాగ వెక్కి వెక్కి ఏడుస్తోంది అఖిల.

"అఖిలా!" గంభీరంగా పిలిచాడు తండ్రి.

ఉలిక్కిపడ్డాడు బోసు. ఇట్టే నవ్వింది జ్యోతి.

గబగబ కళ్ళుతుడుచుకుని పెద్దగా ఆయాసపడుతూ తలుపుతీసింది, రెండుచేతుల్తోను మొహాన్ని కప్పేసుకుని. చప్పున వెనక్కి తిరిగింది.

"అంత యిదవ్వాలా మరి! రేపు సెప్టెంబరుకు వెళ్దువు గాని!" ఓదార్చటానికి ప్రయత్నంచేశాడు తండ్రి.

కాని దుఃఖం పొర్లుకొస్తోంది.

"నువ్వేం చేస్తావే! నీ ప్రయత్నం నువ్వుచేశావు, దైవబలంకూడా వుండద్దూ" తల్లి దగ్గరకు తీసుకుంది.

"అదుగో! స్వర్ణ వచ్చిందిచూడు" అనంగానే ఉక్రోషం పట్టలేకపోయింది. వెనక్కి తిరిగింది.

"అదుగో! డాక్టరుగారు వస్తున్నారు!"

ఇట్టే మొహాన్ని తుడుచుకుని తనదుఃఖాన్ని పైకి కనబడనీయకుండా చెయ్యటానికి ప్రయత్నంచేస్తోంది అఖిల.

"హాలో, డాక్టర్!"

"హా ఈజ్ అఖల! ఏవమ్మాయి! ఎవ్విరిథింగ్ ఓ కే!" అఖల నాడి పరీక్ష చేస్తున్నాడు డాక్టరు.

"ఏదీ నావంక చూడు!" నుదురుమీద చెయ్యి పెట్టి, అఖల మొహాన్ని పైకెత్తాడు.

"కళ్ళన్నీ ఎర్రబడ్డాయి!... మొహమంతా ఉబ్బరించింది. పాటక చేరీ చేశావా ఏమన్నా!" నవ్వుతూ అన్నాడు డాక్టరు.

నలుగురూ నవ్వారు. బిడియంతో తలవంచుకుంది అఖల.

"ఇలాంటి అనవసరమైన పనులు చేసే ఆరోగ్యం చెడగొట్టుకుంటారు మనవాళ్ళు. నువ్వేం చేస్తావు! జ్వరం వచ్చింది, పరీక్షలకు వెళ్ళలేకపోయినావు. ఈ భాగ్యానికి యింత ఫీలవ్వాలా! సెప్టెంబరు వుండనేవుంది. అదితప్పితే మార్చి." నాలుక కరుచుకున్నాడు డాక్టరు.

బలవంతంగా కొంచెం మొహం వెడల్పు చేసుకుంది అఖల.

"షీ ఈజ్ ఒకే. కాస్త రెస్టు తీసుకోవాలి! అంత చేటు ఏడవటం మానెయ్యి అమ్మాయి!" గిర్రున వెళ్ళిపోయాడు డాక్టరు.

గదితలుపు సందుల్లోంచి అతి శ్రద్ధగా చూస్తున్న కమల డాక్టరు గడపదాటంగానే సరాసరి వెళ్ళి టేబుల్ ముందు కుర్చీలో మేగజైన్ పట్టుకుని కూర్చుంది.

అఖిలవుతే యెవ్వరితోనూ మాట్లాడకండా సూటిగా గదిలోకి వెళ్ళిపోయింది.

స్వర్ణతో పాటు పోటీగా చదువుతూ ఒకరికంటె ఒకరు ఎక్కువమార్కులు తెచ్చుకోవాలని పట్టుదలగా చదివిన అఖిలకు అంతరాయం కలిగేటప్పటికి చెడ్డఉక్రోషం వచ్చేసింది. స్వర్ణనుచూడటానికి మొహం చెల్లటంలేదు. అసూయా అసహనాలు లేక అన్యోన్యంగా కలిసిమెలిసి తిరుగుతూ, మంచీచెడూ చర్చించుకుంటూ. కమలకంటేకూడా ఆప్యాయంగా చూసుకుంటున్న స్వర్ణమీద తనకున్న అభిప్రాయమూ, ప్రేమా, ఆప్యాయతా, అన్నీ యిట్టే తారుమారయి పోయినాయి. పరీక్షలు దగ్గరకొస్తున్నకొద్దీ యిద్దరికీ ఆదుర్దా హెచ్చిపోయింది. రాత్రింబగళ్ళు చదువు, ఒకవైపు దిగులు, మరొకవైపు ఏమవుతుందాయని! ఎల్లుండి పరీక్షలు అనగా తలకాయనెప్పి వస్తోందే అని మొదలుపెట్టింది అఖిల. అప్పటికీ లెక్కచెయ్యక రాత్రంతా మేలుకుని చదువుతూనే వుంది. మర్నాడు లేచేటప్పటికి ఒళ్ళంతా నెప్పులుగా వున్నట్లనిపించింది. థర్మామీటరు నోట్లోపెట్టుకునేటప్పటికి పాదరసం పైకిపోయింది. దాంతో సగంనీరసించిపోయింది. తెగ ఆవేదన పడింది. అట్లాగే పుస్తకంపట్టుకుంది. పేజీల్లో ఏమీ కనిపించటంలేదు. మనస్సయితే ఆరాటపడిపోతోంది. తెల్లారితే పరీక్షలు. సాయంత్రం అయ్యేటప్పటికి కదల్లేనిపరిస్థితి ఏర్పడింది. బాధతో పాటు ఉక్రోషమూ వచ్చేసింది. ఏమీ చెయ్యలేని అశక్తతతో మంచంమీద పడుకునివుంది. లోపల

లోపల కుమిలిపోతోంది. పెద్దపెట్టున ఏడ్చి హైరాణ తెచ్చు కుంది. దాంతో జెంపరేచరుకూడా పెరిగిపోయింది. రాత్రంతా చదివినపాఠాలు అప్పచెప్పటమే! కలవరింతలు, ఇష్టంవచ్చినట్లు మాట్లాడటం! తాను నిద్రపోలేదు, ఇంట్లో వాళ్ళనూ నిద్రపోనివ్వలేదు. మర్నాడు తన క్లాసుమేట్సు అందరూ పరీక్షహాలులో కూర్చున్నారు. తానేమో యింట్లో మంచంమీద హాయిగా పడుకునివుంది.

అఖిల పరీక్షలకు రాకపోవటాన్ని గురించి అందరికంటె యెక్కువగా బాధపడింది స్వర్ణ. ఓసారి అఖిలనుచూద్దామని ఎలాగో వీలుచేసుకుని వస్తే స్వర్ణవచ్చిందని తెలుసుకుని, తలుపులు గట్టిగా బిగించేసుకుంది అఖిల.

ఈ వారంరోజుల అనుభవం, అఖిలమనస్సులో బాగా నాటుకుపోయింది. ఎవ్వరితోనూ మాట్లాడదు. తనకుతానుగా ఏకాకి అయిపోయింది.

"ఏమిటా పెంకితనం? ఓమూల స్వర్ణవచ్చి పిలుస్తుంటే కూడా వెళ్ళవేమిటి?" తల్లి మందలించింది. కాని ఆమె లెక్కచెయ్యలేదు.

ఒంటరిగా కూర్చుని ఆందోళనను కోరితెచ్చుకుం టోంది. మనస్సు విరిగిపోయినట్లయింది. చదువంటేనే విరక్తి పుట్టుకొచ్చి నట్లయింది. జీవితమంటేనే అసహ్యం పుట్టింది. దిగాలుపడికూర్చుని వికృతంగా ఆలోచించుకుంటోంది. తనకు స్వర్ణకు పోలికలు, విభేదాలు ఊహించుకుంటోంది. కమల తననుగురించి ఏమనుకుంటోందో ఆలోచిస్తోంది బాగా

సంతోషిస్తూవుంటుంది అనుకుంటోంది ఈపరీక్ష ప్యాసవం గానే స్వర్ణయచేబోయే కార్యక్రమం తలుచుకుంటోంది. తన జీవితం యింతేనా అని విచారపడుతోంది. నా కెవ్వరూ లేరు. ఒంటరిదా న్నయిపోయాను. పెద్ద నిట్టూర్పువిడిచి, ఒక్కసారిగా లేచి నిలబడింది. వెనక్కుతిరిగింది.

ఎదురుగా స్వర్ణ కనుపించింది.

"అఖిలా!" స్వర్ణ అమాంతం చుట్టేసుకుంది.



# 5

సుగుణమ్మ పెద్దపెట్టున ఏడుస్తూ కూర్చుంది. ఎవ రెన్నివిధాల చెప్పినా ఊరుకోవటంలేదు. కడుపు దించుకుని మరీ ఏడుస్తోంది. 'మనం అప్పీలుకు హైకోర్టుకు వెడతాం. అంతటితో పూర్తిఅయినట్లుకాదు' అని రమణ ఎన్నివిధాల చెప్పినా, ఆమె మనోవేదన తగ్గటంలేదు ఎట్లాగయినా కొడుకును కాపాడమని ఒకటే ఘోష.

"రమణా! ఆమెను ఇంటిదగ్గర దిగపెట్టిరా! మనఆలో చనలుకూడా చెడిపోతాయి," పుస్తకంలోకి చూస్తున్నాడు భుజంగరావు.

క్రిందకోర్టులో రాజాకు శిక్షవిధించినందుకు ఆయ నేమీ తొణకటంలేదు. ఇది మామూలే. అప్పీలుచేయచ్చు. దానికి కావలసిన వివరాలన్నీ సేకరించి రడీగానే పెట్టివుం చాడు. ఒకజడ్జీ పొరపాటున తీర్పుయిచ్చినంతమాత్రాన న్యాయానికి స్థానం లేకుండాపోదు. కోర్టుల్లోజరిగే న్యాయ మంటేఏమిటో ఆయనకు పూర్తి అనుభవమే! దీన్ని విమర్శిం చటానికి వీల్లేదు. కోర్టువారు ఏ కేసునూ స్వయంగావచ్చి చూసే అవకాశములేదు. వారిమనస్సుకు నచ్చేలాగున సాక్ష్యం చెప్పించాలి. చట్టంలో యిరికించాలి. గంభీరంగా తీర్పుయిస్తారు. ఒక్కొక్కప్పుడు జరిగినదానికి, తీర్పుయిచ్చిన

దానికి సంబంధం ఉండకపోవచ్చు. అంతమాత్రంచేత కోర్టు వారిని నిందించి ప్రయోజనం లేదు. ఒకవేళ, వున్న పరిస్థితులను బట్టి, యివ్వాలిసినరీతిగా తీర్పు యిచ్చినంతమాత్రాన న్యాయం గెలిచిందని అనుకోవటానికి వీల్లేదు. ధర్మాధర్మాలవిచక్షణ ఈ కోర్టువారి బాధ్యతకాదు. చట్టాల్ని నిర్వచించటం, సాక్ష్యాన్ని సేకరించటం, సాధ్యమైనంత వరకు సత్యంఏమిటో తెలుసుకోవటానికి ప్రయత్నించటం, ఈ విధులు వారు సక్రమంగా నిర్వహించేటట్లు చూడాలసిన బాధ్యత ప్లీడర్లమీద వున్నది. భుజంగరావుకు పూర్తివిశ్వాసం అప్పీలులో యెట్లాగైనా తాను గెలుస్తానని. కాని సుగుణమ్మను చూసినా, రాజాను తలుచుకున్నా అంత నిబ్బరమైన గుండెకూడా అబ్బా అనుకుంటోంది.

"చంద్రం" అంటూ రెండుమూడుసార్లు పిలిచాడేకాని ఏమీ చెప్పలేదు. ఎమిచెపుతాడా అని ఎదురుచూస్తున్నాడు. చంద్రం క్రొత్తగా ఈవృత్తిలో ప్రవేశించినవ్యక్తి. అతనికి కోర్టులమీద జడ్జీలమీద అనేకరకమైన అభిప్రాయాలున్నాయి. ఈ జడ్జిమెంటు యివ్వగానే అతనికి ఓ నిశ్చితాభిప్రాయం జడ్జిమీద ఏర్పడిపోయింది. అది తప్పని అతనికి తెలుసు. అయినా అతని అభిప్రాయం మార్చుకోలేకుండా వున్నాడు అనుభవం తక్కువవలన, తొందరపాటు ఎక్కువవన్నట్లు కనిపిస్తుంది. తీర్పు వచ్చినప్పటినుంచి, చాలా విచారపడుతున్నాడు. వ్యక్తిగతంగా తనకేదో దెబ్బతగిలినట్లు బాధపడుతున్నాడు.

"ఇట్లా తీర్పువస్తుందని అనుకోలేదు. జడ్జిగారు" అంటూ ఏదో చెప్పబోయాడు

చెయ్యిచూపించి ఆగమన్నట్లు సంజ్ఞచేశాడు భుజంగ రావు.

"అయిపోయినదాన్ని గురించి మనం అనేకం అనుకోవటం సహజం. మనకు అనుకూలంగా రాకపోవటంవలన కొంచెం తీవ్రంగానే మన అభిప్రాయాలు వెళ్ళబుచ్చుతాం. అయితే వాటి నిజానిజాల ప్రసక్తి మన కినవసరం. మనకు అప్పీలుకు అవకాశం వున్నప్పుడు, యింకొకవిషయం మన మనస్సులో ప్రవేశించరాదు. ఇప్పుడు మనధ్యాసంతా దాని మీదే!"... అటూయిటూ తిరుగుతూ అన్నాడు భుజంగ రావు.

నిశ్చేష్టుడయి చూస్తున్నాడు చంద్రం.

"సరే యిదిట్లావుంచు. మాధవి ఎవత్తోయ్! వింతగా వుంది కేసు" కళ్ళార్పుతూ చూశాడు చంద్రం.

"బోలెడంత ఆస్తివుంది. ఏం లాభం ఆస్తిని యెట్లా వుపయోగించుకోవాలో తెలుసుకోలేక పోయినతర్వాత! ఆడదయిపోయింది. ఆమె సాహసంగా ఏమిచేసినా సంఘం ఓర్వలేదు. కట్టుబాట్లతో కట్టెయ్యటానికి ప్రయత్నిస్తుంది! ఆ అబ్బాయి యెవరు!"

"ఏమోనండీ! మాధవిని అత్తయ్యా అని పిలుస్తూ వుంటాడు." ఆయాసపడ్డాడు చంద్రం.

"ఆమె కేసు గెలుస్తుంది. గెలిపిస్తాను!" సంతృప్తిగా నవ్వాడు.

"పాపం..."అంటూ జాలిగా యేదో చెప్పబోయాడు చంద్రం.

"పాపం! దేనికి పాపం! నువ్వొట్టి అమాయకుడివి లాగా వున్నావ్!" వికటంగా నవ్వాడు భుజంగరావు...

"ఏమిటివ్వాళ యిట్లా నవ్వుతున్నారు! ఆ సుగుణమ్మ అంతఏడుపు, మీరు యింతనవ్వటం రెండూ నాకు ఆశ్చర్యంగానే వున్నాయి" వస్తూనే రమణ అన్నాడు.

"నీకు అన్నీ ఆశ్చర్యంగానేవుంటాయి !" యింకా నవ్వుతున్నాడు.

నిజంగా ఆశ్చర్యంగానేవుంది చంద్రానికి. "ఎప్పుడూ కూడా యింతఉల్లాసంగా పంతులుగారిని చూడలేదు. ఇవ్వాళ అదో తమాషాగావున్నారు." అనుకున్నాడు.

"ఓసారి నేను హైదరాబాదు వెళ్ళిరావటం మంచి దంటావా ?" ఆలోచనగా అన్నాడు భుజంగరావు.

"ఎందుకండీ ?"

"అక్కడెవరైనా వకీళ్ళతో మాట్లాడిరావటానికి !"

"మీా రెందుకనో ఈసారి చాలా భయపడి పోతున్నారు !"

"నీకు తెలీదు రమణా ! ఆడదికాబట్టి సుగుణమ్మ బావురుమంది. నేను మనస్సులో చాలా బాధపడుతున్నాను.

ఇక్కడ కన్విక్షన్ యిచ్చినందుకు కాదు. రేపు హైకోర్టులో ఏమవుతుందో అని! ఒక్కొక్కప్పుడు నా ఆలోచనగూడా స్తంభించిపోతుంది. పాపం ఆమెగారు ప్రాణాలన్నీ మనమీద పెట్టుకుని కూర్చుంది. మనకు ఈ కేసుమీద యెంత శ్రద్ధ వుందో ఆమెకు తెలియదు. ఏమైనాగాని, నేను ఒంటరిగానే ఈ కేసును నడిపించాలంటే ధైర్యం చాలటంలేదు." ఆవేదనగా అన్నాడు భుజంగరావు.

రమణ విస్తూరపోయాడు. 'భుజంగరావుగారేనా యీ మాటలు అనేదీ' అని ఆశ్చర్యపోయాడు. చంద్రంఅవుతే కాస్త ధైర్యంగా వుందా మనుకుంటున్నసమయంలో ఈ మాటలు వినేటప్పటికి, నిరుత్సాహం ఒక్కపెట్టునవచ్చి ఆవహించింది!

ఇద్దరిమొహాలవైపుకు ఒక్కసారిగాచూసి వ్యంగ్యంగా నవ్వుతూ "మీరేమంటారో అని అన్నమాటలు నిజాలు కావు. భయపడకండి" అన్నాడు భుజంగరావు.

చంద్రం రమణ ఒకర్నొకరు చూసుకుని అయోమయావస్థలో పడిపోయారు.

"వెళ్ళొస్తానండీ" అంటూ చంద్రం లేచాడు.

"మళ్ళీ ఎప్పుడు రావటం!" అడిగాడు రమణ.

"రాత్రికి వస్తానుకాదండీ! మీరూ వస్తారుకాదూ!"

"నే వెళుతుంటేగా ఎక్కడికేనా! ఏమండీ మీ అభిప్రాయం ఏమిటి?"

"దేనివిషయంలో!" అగాడు భుజంగరావు పుస్తకాన్ని మూస్తూ.

"అదే. చంద్రం విషయంలోనండీ!"

"ఊఁ" నాకూనీకూ అనేక అభిప్రాయాలుండచ్చు. సంబంధించిన మనుష్యులకు ఎలాంటి అభిప్రాయాలున్నాయో తెలుసుకోవాలి! అనవసరంగా నేను ఒకరిమీద వత్తిడి తెచ్చాననే దురభిప్రాయం ఎవ్వరికీ కలుగకూడదు. అది ఉభయుల గౌరవానికి సంబంధించినవిషయం! బాగా ఆలోచించు..."

"మా అమ్మాయేమో యింకా యేమీ చదవనంటోంది. అఖిల పరీక్షలకు వెళ్ళలేకపోయిందని యేదో మానసిక బాధ పడుతోంది" ప్రారంభించాడు రమణ.

"పిచ్చిపిల్ల! అదేమున్నమాట! చదువుకోవాలనుంటే చదవటం మంచిదే. ఒకళ్ళతో వంతేమిటి?

"పోన్లెండి. ఇప్పుడు ఇంకా చదువుకునిమాత్రం చేసేదేముందిగాని"

"నీకూ అదే అభిప్రాయమా! అయినా అసలు ఏదీ చెయ్యనప్పుడు చదువుకోవటమే మంచిది."

"దానికి బుద్ధిపుడితే చదువుకుంటుంది, లేకపోతే లేదు. చదువు చెప్పించమని అడుగుతేనే చెప్పిద్దామనుకుంటున్నా. దీంట్లోకూడా బలవంతం యెందుకు?"

"బలవంతమనేది దేంట్లోనూ పనికిరాదు!"

"అదేమన్నమాటలెండి. రేపు పెళ్ళిళ్ళవిషయంలో మనబాధ్యత మనం నెరవేర్చుకోవద్దూ?

"సరే, కానీండి! మనం వద్దనుకుంటే పోయేవా, కావాలనుకుంటే వచ్చేవా? ఎవరి బాధ్యతలువాళ్ళకు వుండనేవున్నాయి!"

"అక్కగారు పెద్దమ్మాయివిషయంలోనే బాగా దిగులుపడిపోతున్నారు. ఒకదానిమీద ఒకటి వచ్చిపడింది. ఈ పరీక్షలకు వెళ్ళకపోవటంకాదుగాని, మరింత చిరాకు కలిగిస్తోంది ఎప్పుడూ అదేమాట! దిగులుగా కూర్చుంటుంది. అమ్మాయికి పెళ్ళిచేసి అత్తారింటికిపంపిస్తే కాస్త ఏమన్నా మెరుగుఅవుతుందేమోనని అనుకుంటున్నారు. ఏదైనా మంచిసంబంధం చూడమంటున్నారు. అన్నీ కుదిరితే మా అమ్మాయికికూడా యీయేడే పెళ్ళిచేసేద్దామనుకుంటున్నానండి. నాకూ ఓపిక తగ్గిపోతోంది. ఏమో యీ చదువులు చెప్పించి, ఎంతవరకు మనింట్లో వుంచుతాం! మళ్ళీ వుద్యోగాలు అంటారు. ఈ జంఝాటనంతా యెందుకు? పెళ్ళిచేసిపంపిస్తే వాళ్ళిష్టం. చదువులు చెప్పించుకోనీ ఉద్యోగాలు చెయ్యనీ."

"మంచిదే" ఒక్కముక్క అని వూరుకున్నాడు భుజంగరావు. ఇంకా ముందుకు సాగలేకపోయాడు రమణ.

"మంచిదే! అట్లాగే కానీయండి," అని మళ్ళీ అన్నాడు.

"మరి మీ ఉద్దేశమేమిటో చెప్పావు కాదు !"

"ఏమని చెప్పమంటావ్ ! అన్నీ నువ్వే చెప్పేస్తివి. బాగానే వుంది. నాకు సమ్మతమే !"

"ఏమిటి సమ్మతం !"

"పిల్లల పెళ్ళిళ్ళు చెయ్యటం !"

"ఏ సంబంధమని !"

"చూపిస్తానంటున్నావుగా !"

"అంతేనంటారా ?"

"ఇంకా ఏదైనా వుంటే చెప్పు !"

"బాగానే వుంది! మీరుకూడా చెపితే బాగుంటుంది కాని!"

"నేను చెప్పకండా ఎట్లావూరుకుంటాను! ఆ సమయం వచ్చినప్పుడు నేనూ మాట్లాడతాను. తప్పుతుందా! ఎవరు చేసేపనులు వాళ్ళు చేసుకుంటూ వెళ్ళటమే! ఒకళ్ళకోసం ఆగకూడదు ఎవరిప్రయత్నం ఫలించినా సంతోషమే !"

"అయితే నేను చంద్రాన్ని అడిగిచూస్తాను." అంటూ రమణ వెళ్ళిపోయాడు.

తలఊపుతూ భుజంగరావు రూమంతా మామూలుగానే పచార్లుచేస్తున్నాడు. ఆయనమనస్సులోకి గతం వచ్చి శూలంలాగా గుచ్చుకుంటోంది. వర్తమానకాలం ఒడుదుడుకులుగా వుంది. భవిష్యత్తు అసలేమీ అంతుపట్టడంలేదు.

కుర్చీలోకివచ్చి కూర్చున్నాడు! 'నేనెవర్ని' అని ప్రశ్నించుకున్నాడు. 'భుజంగరావుని. కాదు, పెద్దవకీలును. కాదు, నలుగురుపిల్లల తండ్రిని. కాదు' ఉన్నపదవులతో తనను ముడిపెట్టటానికి మనస్కరించటంలేదు. 'నేను నేనే. ఒంటరిగా యీ లోకంలోకి వచ్చిపడ్డా. నా ఆనందం, సంతోషం, సౌఖ్యం అన్నీ నాలోనే యిమిడివున్నాయి. నా మనస్సులో ఎన్నో భావాలు, ఉత్పత్తిఅయినాయి. ఎన్నో ఆవేశాలు పైకి ఉబికినాయి. అన్నింటిని నాలోనే పొదివి పెట్టుకున్నాను. నేను నేనుగానే వుండిపోతాను. నేను నేనుగానే వెళ్ళిపోతాను' ఉద్రేకపడుతున్నాడు. ఆయన మనస్సులోకి ఏదోభావన వచ్చిపడింది. ఒళ్ళు ఒక్క పెట్టున వణికేసింది. దాంతో ఇవన్నీ అనుకుంటూ కాస్త శాంతపడుతున్నాడు. కాని ఎన్నోబాధ్యతలు చుట్టూ ఆవరించుకుని వున్నాయి. రోజురోజుకు అవన్నీ దగ్గరగా వలయాకారంగా వచ్చేస్తున్నాయి. ఇవన్నీ మీదకొచ్చి కబళించే ముందరే తాను ఆ ఆవృతంలోంచి బైటపడాలని తాపత్రయ పడుతున్నాడు. ఊగిఊగి కుర్చీలోంచి క్రిందపడబోయి, చప్పున గోడ పట్టుకున్నాడు...

"అదేమిటండీ!" అంటూ గాభరాగా వాగేశ్వరి వచ్చింది.

"ఏంలేదు... నిద్రవచ్చినట్టుంది." అంటూ కళ్ళు రెండూ పెద్దవిచేశాడు.

పెద్దగా నిట్టూర్చింది.

"అమ్మాయిపద్ధతేమీ బాగా లేదండీ! ఎన్ని చెప్పినా వినటంలేదు!... మీరన్నా కేకలేస్తే వింటుందేమో !"

"కాస్తదాన్ని ఆర్భాటంచెయ్యటం నీకు మొదటి నుంచి అలవాటే !"

"మిన్నువచ్చి మీదపడ్డా మెదలకండా కూర్చోవటం మీకలవాటు. ఏంచెయ్యమంటారుమరి! పెద్దమ్మాయి యిట్లా తయారవుతే కమలేమో బొత్తిగా మాట వినటమే మానేసింది. నేనుఒక తెను యింట్లోవున్నాను, చెపుతున్నాను అనే ధ్యాసే లేదు దానికి. ఆడపిల్లకు అంతయిది పనికిరాదు ఎట్లాగయినా ! మీరు గట్టిగా కేకలువేస్తే అది అట్లా వుంటుందంటారా!" భర్తముఖంలోకి చూసింది.

"పిల్లలకు వయస్సువస్తున్నకొద్దీ, మనం అధారిటీ చెయ్యటం తగ్గించుకోవాలి. వాళ్ళంతటవాళ్ళు నిశ్చింతగా వుంటున్నట్లు మనం వాళ్ళకు ఒక అభిప్రాయం కలగ చెయ్యాలి. వాళ్ళేదైనా తప్పుచేస్తే అమ్మానాన్నా కోప్పడతారనేభయం మనం మౌనంద్వారా ప్రవేశపెట్టాలి. తెల్లారి లేచినప్పటినుంచి అయినదానికి, కానిదానికి, ఏదోఒకటి అంటుంటే మనమీదవున్న గౌరవాలు పోవటమేకాకండా మనమీద అసహ్యం, ఏవగింపు కలుగుతుంది. ఆ స్థితికి వచ్చినతర్వాత, మనం ఎన్నినీతులుబోధించినా ఒకటే!"

"ఏమో, మీ మగవాళ్ళకు యిది సాధ్యమవుతుందేమోకాని, అస్తమానం కొంపలోపడివుండే మా ఆడవాళ్ళకు యిట్లా ముభావంగా వుండటం చేతకాదు. అసలు

అట్లావుంటే పిచ్చికూడా ఎత్తుతుందేమో! మీ సిద్ధాంతాలు, మీ రికామీతనం మాకురావు.” ఖచ్చితంగా చెప్పేసింది.

“ఎవరు యెట్లావుంటేయేం! లక్ష్యంసిద్ధిస్తే ఏ ప్రవర్తనైనా ఫరవాలేదు. ఓపికపట్టాలి. సహనంతక్కువయ్యేటప్పటికి, చిక్కులన్నీ వచ్చిపడతాయి. కాస్త కళ్ళుమూసుకుంటే, కాలమే అన్నింటిని చక్కదిద్దుతుంది!”

“ఇంతయిదిగా మానవమాత్రులు ఎవ్వరూ వుండలేరండి! ఓమూల పిల్లలకు పెళ్ళిడొచ్చె! ఆవిషయం మీకు పట్టందేను! చదువులాఅంటే దాని విషయమూ జోక్యంలేదు. సరే యింటివిషయం అంతెంతమాత్రం! తామరాకుమీద నీటిబిందువులాగ, అంటీ అంటనట్టు వుండటం మహాకష్టమండీ! మీకెట్లావుంటుందో కాని, చూసేవాళ్ళంమాకే మహాబాధగా వుంటుంది. బైటవాళ్ళందరూ ‘మీకేమండీ మహారాజు’ లని అంటారు. ఇంట్లో చూడబోతే యిదీవరస! నాకు మనశ్శాంతి లేకండాపోయిందండి ! మీరేమన్నా అనండి!”

“ఊ ! అల్లుళ్ళురాకమునుపే మనశ్శాంతి పోగొట్టుకుంటావని అనుకోలేదు.” తేలికగా నవ్వాడు.

“మీకు అన్నీ ఎగతాళిగానే వుంటాయి! ... ఏవండీ! చంద్రం విషయంలో మీరేమంటారు!”

“ప్రతివాళ్ళు నేనేమంటాను, నేనేమంటాను అని అడగటమే! నాకు అర్థంకావటంలేదు!”

“ఇంకెవరు అడిగారేమిటి!”

“ఎవరైనా అడుగుతారు, కాస్త తెలుసుకొనివుండితే సరి!”

"రమణగారు అడిగారా!"

"ఆ వివరాల్తో నీకేంపని!"

"నాకు పనివుంది కాబట్టే అడుగుతున్నాను. అన్నగారు మీరు అనుకున్నంత అమాయకుడు కాదు. స్వర్ణ విషయంలో చంద్రాన్ని దృష్టిలో పెట్టుకుని ఆయన చేస్తున్న తతంగమంతా నాకు అర్థం కానిది కాదు. మీతో ఎన్నాళ్ళబట్టో చెపుదామనుకుని కూడా, మీరు నమ్మరనే వుద్దేశంతో మెదలకండా వూరుకున్నాను. ఇవ్వాళ కూడా. మీరు నమ్మతారని నేను చెప్పటంలేదు. ఇక సమయం మించిపోతుందనే భయంతో మీకు చెపుతున్నాను! అన్నగారు ఎంత చెపితే అంత చంద్రం. ఆ స్థితికివచ్చింది వ్యవహారం!" ఉద్రేకంగా చెపుతోంది వాగేశ్వరి.

ఆయన మెదలకండా వూరుకున్నాడు.

"నాకేమీ అపూయలేదు. స్వర్ణకు కూడా మంచి సంబంధం రావాలని నాకూవుంది." మళ్ళీ తమాయించుకుని అన్నది.

"ఇద్దరువ్యక్తులు అతిసన్నిహితంగా వున్నప్పుడు ఒకరి లోపాలు ఒకరు ఎత్తిచూపటంలో గౌరవంలేదు. ఒకరి గొప్పతనం ఒకరు ఆకళింపుచేసుకోవటంలో ఠీవి వుంది. హుందాతనం వుంది. నీదృష్టిలో రమణకు నాదృష్టిలో రమణకు చాలా తేడావుంది. చంద్రం, ఒక వరుడుగా మీ దృష్టిలోకివస్తే, అమ్మాయిలిద్దరూ స్వర్ణలో మనం తేడా చూపించకూడదు. ముగ్గుర్లో, ఎవర్ని యిష్టపడి చేసుకున్నా, నాకు సంతోషమే! అసలు అతని ఉద్దేశంకనుక్కున్నతర్వాత

కదా మనం మిగతావి అనుకునేది!" చాలా అలసటపడ్డట్టు కనిపించాడు.

"సరి మీరడుగుతేగా! మీరు అడుగుతే అతను కాదనడు."

"అది పద్ధతి కాదు. అతన్ని నేను అడిగి యిరకాటంలో పెట్టటం బాగాలేదు."

"మీరెట్లా తెలుసుకునేది! ఏమండీ మిమ్మల్ని ఒక్క మాటడగనా!" స్థాయితగ్గించి మెల్లిగా ప్రాధేయపడుతున్నట్లడిగింది.

గభాలున తలెత్తి తీక్షణంగా భార్యవంక చూశాడు.

"మనల్నిచూసి అసూయపడి ఎవరో ఓర్వలేనివాళ్ళు మీరుచేసే ప్రతిపనికీ పెడర్థాలు కల్పిస్తున్నారు. నేనవ్వుతే నమ్మటంలేదు మీమీద నాకు పూర్తివిశ్వాసం వుంది. మనరోజులు తిన్నగా వెళ్ళేటట్లు భగవంతుని ప్రార్థిస్తున్నా." అంటూ రెండుచేతులు యెత్తి భర్తకు నమస్కారంచేసింది వాగేశ్వరి.

"వాగేశ్వరీ!" అనుకున్నాడు మనస్సులో.





# 6

ఉద్యోగంలేక కొంతమంది అవస్థపడుతుంటే, ఉన్న ఉద్యోగాన్ని కాదని, రాజీనామాపెట్టేవాళ్ళు కొందరు. తృప్తి ఉద్యోగంలోలేదు కేవలం అది మనస్సులోనేవుంది.

లేకపోతే నిక్షేపంగా సెంట్రల్ గవర్నమెంటు ఉద్యోగంలోవుంటూ పనిచేసినా చెయ్యకపోయినా నెలయ్యేటప్పటికి రెండువందలరూపాయలకుపైగా తీసుకుంటూ నిశ్చింతగా వుండాల్సిన చంద్రం దాన్నికాదని రాజీనామాచేసి వకీలు వృత్తిలో ప్రవేశించటానికి వచ్చాడు. భుజంగరావుగారి దగ్గర చేరటానికి ఎంతో పెద్ద సిఫార్సు పట్టుకువచ్చాడు. చాలా శ్రమపడ్డాడు. చివరకు సాధించాడు. చంద్రంమనస్సు కుదుటబడింది.

అయితే అతనికున్న నిశ్చితాభిప్రాయాలను బిగువుగా పట్టుకువస్తున్నాడు. అందరితోను ఎడఎడంగావుండాలని ప్రయత్నిస్తూనేవుంటాడు. కాని వృత్తి అవిధంగా వుండనీయటంలేదు. మాటకారికావాలి, అయినవాళ్ళతోనూ కానివాళ్ళతోనూ పరిచయాలు ఏర్పాటుచేసుకుంటూ వుండాలి. ఏ పుట్టలో ఏపాముందో మరి!

రూములోకివచ్చి వాకిటతలుపులు బిగించేసి కిటికీ తలుపు బార్లగా తెరిచాడు. కిటికీ ప్రక్కగానే పట్టెమంచం వేసుకుని నడుంవాల్చాడు. ఎప్పుడూ ఒంటరిగావున్నా తనకు

స్ఫురణకువచ్చేది తాను ఆనాడు ఉద్యోగానికి రాజీనామా పెట్టి న్యాయవాదవృత్తిలో ప్రవేశించటానికి పడ్డపాట్లు. తర్వాత కిలకిలనవ్వుతున్న వసంత. అయితే ఆనవ్వులో ఆనందంలేదు. పరిహాసంవుంది. అది అతను భరించలేడు

రమణ స్ఫురణకువచ్చినప్పుడు అమ్మో ఆయన సామాన్యుడుకాడు అనుకుంటాడు. ఆయనకూతురు స్వర్ణ పాపం అమాయకురాలు. వకీలుగారి పెద్దమ్మాయికూడా అంతే! రెండోఅమ్మాయి కమల హుషారుగావుంటుంది. తీరికసమయంలో యివే గుర్తుకొస్తూవుంటాయి. భవిష్యత్తు వైపుకు మనస్సు మరలుతూంది. తనపట్టుదల యెంతవరకు సాగించగలుగుతానా అని మళ్ళీ ఆలోచిస్తూవుంటాడు.

కిటికీలోంచి చల్లటిగాలులు మెల్లిమెల్లిగా లోపలికి వస్తున్నాయి. కళ్ళు మూసుకుంటున్నాడు. తెరుస్తున్నాడు. నిద్రాదేవత దోబూచులాడుతూ వస్తోంది. తెరిచినకళ్ళు ఒక్కక్షణం నిలిచిపోయినాయి. వీధంతా నిర్మానుష్యంగా కనిపిస్తోంది కిటికీలోంచి. తనరూముకు ఎదురుగా మేడమీద గదిలోకి తనకళ్ళురెండూ అప్రయత్నంగా ప్రయాణంచేసినాయి. తల కొంచెం పైకెత్తి అట్టే ఆలోచనగా చూస్తున్నాడు.

ఎలక్ట్రిక్ బల్బు నిలకడగా కాలుతోంది. దోమతెర కట్టబడిన మంచం స్పష్టంగా కనబడుతోంది కిటికీతలుపులు క్రిందవిరెండూ మూసేవున్నాయి. తెల్లగా సున్నంకొట్టిన గోడ లైటుకాంతికి తళతళ మెరుస్తోంది. నీడ పడుతోంది. మళ్ళీ యిట్టే అదృశ్యమవుతోంది. మునిగాళ్ళతో మంచం

మీద కూర్చుని రెండు చేతులను రెండు దవడల క్రింద గట్టిగా నిలబెట్టి నిశ్చలంగా చూస్తున్నాడు చంద్రం. ఏవో పూలు లాంటివి గదిలో ఎగిరినట్లు దూరంగా కనిపిస్తున్నాయి. నవ్వులు వినిపిస్తున్నట్లున్నాయి. మూగవోయిన ఆడగొంతుక లోనిధ్వని చంద్రం చెవుల్లోకి వచ్చిపడ్డట్టు వులిక్కిపడు తున్నాడు. గుండె గుభేలుమన్నది గోడమీదనీడ అస్ప ష్టంగా ముద్దగా కనిపించింది. ఇంకోనీడకూడా సన్నిహితంగా కదులుతున్నట్లు అనుమానం వేసింది. ఆరిపోయిన పెదిమల మీదికి పేలవంగా చిరునవ్వు వచ్చికూర్చుంది. ఇంకా ఆవే శంగా చూస్తున్నాడు. రెండుచేతులూ పొడుగ్గా గోడమీద ఒక్కక్షణంపాటు కనిపించి అదృశ్యమయ్యాయి. చేతుల నీడ లనుబట్టి మనిషి ఆకృతిని పోల్చుకోవటానికి వీల్లేనంత స్వల్ప వ్యవధిలో నీడ కనిపించకుండాపోయింది. గాలి మోస్తు కొస్తున్న సువాసనలు ఆగదిలోంచే అనుకున్నాడు. వుద్రేకం ఎక్కువై పోయింది. మంచంమీద అటూ యిటూ చూసు కున్నాడు. తానొక్కడే కనిపిస్తున్నాడు. అతనిబుర్రంతా ఆలోచనలతో నిండిపోయింది. చూస్తూ చూస్తుండగానే గదిలో వెలుగుతున్న లైటు ఠపీమని ఆరిపోయింది.

అమాంతం మచంమీద వెల్లకిలగా పడిపోయాడు చంద్రం.

కళ్ళు మూసుకున్నదగ్గర్నుంచి ఒకటే కలవరింతలు అర్థంలేకండా వస్తున్నాయి. మధ్యమధ్య నిద్రలోనే ఉలిక్కి- పడుతున్నాడు. ఆరాత్రంతా చంద్రంమనస్సుకు శాంతిలేదు. తెలతెలవారుతుండగా నిద్రపట్టింది. బారెడుపొద్దెక్కేదాకా

నిద్ర లేవనే లేదు. కళ్ళు చిటచిటమంటున్నాయి. చిట్లించు కుంటూ బద్ధకంగా, ఓడిపోయినసిపాయిలాగ, తూలుతూ, బిత్తరపోతూ మెల్లిగా వెళ్ళి తలుపులు రెండూ తెరిచాడు. వేసవి ఎండ అప్పటికే చుర్రుమన్నది. గభాలున తలుపులు వేశేశాడు. వచ్చి కుర్చీమీద నిద్రమత్తువదలటానికి కూర్చున్నాడు.

కోర్టుకు శలవలిచ్చినా, యింటికి వెళదామనుకోవటం లేదు. వింతవింతగా ఆలోచిస్తున్నాడు. వసంతకు ఉత్తరం వ్రాయాలనిపించింది. రాత్రి అనుభూతులు తమాషాగావచ్చి అతన్ని దాడిచేస్తున్నాయి. ఆక్షణంలో నిజంఅనిపించేలాగున తన్మయంచెందాడు. ఒక్కొక్కటే గుర్తుకొస్తున్నకొద్దీ వసంతకు తప్పక ఉత్తరంవ్రాయాలనిపిస్తోంది. ఈరోజునుంచి తనజీవితంలో ఏవోమార్పువచ్చినట్టుగాచిత్రించుకుంటున్నాడు. ఏరకమైనమార్పో, ఏవిధంగా వచ్చిందో గట్టిగా చెప్పలేక పోయినా చంద్రందం పూర్తిగా మారిపోయాడు అని తనలో తాను మురిసిపోతున్నాడు. మళ్ళీ క్షణం తాపీగా కూర్చుని ఆలోచిస్తే ఏమీ కొత్తవిషయం కనబడటంలేదు. ఆశ్చర్య పోతున్నాడు. ఇలాంటిమార్పులు యెందుకువస్తున్నాయి. ప్రత్యేకంగావచ్చినమార్పు ఏమీలేదు. మనస్సు తెచ్చు కుంటున్న మార్పే! మహాచంచలమైన మనస్సు రకరకా లుగా క్షణంలో ఆలోచించగలదు, నవ్వించగలదు, విచా రంలో ముంచగలదు! పెద్దస్థితిలో వున్నట్టు అనుభూతి యిస్తుంది. ఏమీ లేకపోయిందే అని క్రుంగదీస్తుంది. అన్నీ వున్నాకూడా ఒక్కొక్కప్పుడు దేన్నీ చూడనీయదు. ఏమీ లేకపోయినాకూడా అన్నీ ఉన్నట్టేభావించుకుంటుంది. దిగులు,

నిస్పృహా, సంతోషం, ఆనందం అన్నీ మనస్సుచుట్టూతిరుగు తుంటాయి. మనం ఏదనుకుంటే అదయిపోతాం. అంతా మనలోవుంది. మనల్నిబట్టి మిగతావి మారుతూవుంటాయి. అన్నీ తనకు అనుకూలంగావున్నట్టు తాను పెద్దవకీలుఅయినట్టు తనకోరిక నెరవేరినట్టు, అప్పుడు తాను ఏవిధంగావుండేదీ ఆలోచించుకుంటూవుంటే, అసలు ఈ లోకాన్ని మరచి పోయాడు. ఒక్కక్షణంలో తలవిదిలించేసి గట్టిగా కళ్ళు తెరిచేటప్పటికి తాను ఒంటరిగా కుర్చీమీద దిగాలుపడి కూర్చునివున్నట్టుమాత్రం తెలిసింది. చివాలునలేచాడు. ముఖప్రక్షాళనచేసుకుని నీటుగా ఇస్త్రీబట్టలువేసుకుని భుజంగ రావుగారింటికి వెళదామని ఉద్యుక్తుడవున్నాడు. చిందర వందరగా అటూయిటూ పడేసిన వస్తువుల్ని వెదుక్కుంటు న్నాడు. ఎన్నాళ్ళుసర్దినా ఎంతసేపుసర్దినా బ్రహ్మచారి రూము బ్రహ్మచారిరూమే! సమయానికి ఒక్కటీకనబడదు. ఏదోవేళప్పుడురావటం, ఎక్కడో పడెయ్యటం! నిర్లక్ష్యం, అశ్రద్ధ, ఈ రెంటినీ అరికట్టటానికి తగిన బందోబస్తు చెయ్యాలి! చివరకు ఎట్లాగయితేనేం కిటికీలో పెన్ను దొరికింది. పరుపుక్రింద కాగితాలు కనిపించినాయి. ఆదరా బాదరాగ బయలుదేరాడు. తలుపులువేసేముందర ఒక్క సారిగా రూమంతా కలియచూసి యిట్టే వెనక్కుతిరిగాడు. ఎదురుగా గమణ ప్రత్యక్షమయ్యాడు. నివ్వెరపోతూ నిల బడిపోయాడు చంద్రం. "లోపలికిరండి" అన్నాడు.

ఇద్దరూ సావకాశంగా చెరొక కుర్చీలో కూర్చు న్నారు.

"ఇంటిదగ్గర్నుంచేనా రావటం ?" ని స్తబ్దతను భంగ పరిచాడు చంద్రం.

"అవును ఇంటిదగ్గర్నుంచే !"

"పంతులుగారింటికి బయలుదేరారేమిటి ?"

"కాదు ప్రత్యేకంగా నీదగ్గరకే !"

"ఆ !..." నవ్వాడు చంద్రం. 'అట్లాగయితే కాఫీ పెడతా నాగండి' "ఇప్పుడు కాఫీ యేమిటి ?" "ఇంకా నేను తీసుకోలేదులెండి" అంటూనే స్టౌ వెలిగించాడు.

"ఏం !"

"ఇవ్వాళ ఆలస్యంగా లేచాను."

"ఎందుకని! రాత్రి చాలాసేపు మేలుకున్నా వేమిటి?"

"అబ్బే లేదండి ! అసలు నిద్రపట్టకపోతే !" కాఫీ తయారుచేయటంలో నిమగ్నుడయిపోయాడు పూర్తిగా.

"ఎందుకు నిద్రపట్టలేదు ?"

"మీ ప్రశ్నలన్నీ బలేతమాషాగా వుంటాయండి ! 'ఎందుకు నిద్రపట్టలేదు' అని మీరట్లా అడుగుతే నన్నేం చెప్పమంటారు ?"

"అందుకుకాదయ్యా ! ఒంట్లో సరిగ్గాలేకా లేక పోతే... ?"

"తీసుకోండి కాఫీ." అంటూనే చురుమనిపించు కున్నాడు చంద్రం చెయ్యి.

"అయ్యో ! జాగ్రత్త! నాకోసం బాగా శ్రమపడు తున్నావ్ ! బాగా కాలిందా?"

"లేదులెండి !"

"అందుకనేఅన్నారు ఎవరుచేసేపని వాళ్లు చెయ్యాలని. కాఫీ చప్పరిస్తూ చంద్రంమొహంలోకి చూశాడు రమణ.

చంద్రంకూడా సరదాగా చిరునవ్వుమొహం పెట్టాడు.

"కాఫీ బాగానే చేస్తావ్"

"ఏమండీ! ఆ పాపయ్యగారు ఊపిరి సలపనీయటం లేదే! పొలంసంగతేమయింది?" అంటూ కూర్చుంటాడు.

"అవునయ్యా, ఆయన కొరకు పొలంసంగతేకాబట్టి కనిపించినప్పుడల్లా అడుగుతూవుంటాడు. మనకు లక్షాతొంభై కేసులు, అవాకటే చూస్తూకూర్చుంటే మనకెట్లా కుదురుతుంది! అయినా ఆయనకేం తొందరొచ్చిందని? రీసీవర్ని అపాయింట్ చేయించాంగా!

"అవుననుకోండి. పొలం మనస్వాధీనంలోకి ఎప్పుడు వస్తుందీ అంటాడు."

"ఆ, వస్తుంది స్వాధీనంలోకి. ఎదురుచూస్తూకూర్చోమను. ఎస్టేటో, ప్రయివేటులాండో యింకా డిసైడ్ కాలేదు. దానిమీద పాతరికార్డులన్నీ వెతకలేక సతమతమవుతున్నారు. అథవా అది డిసైడ్ చేసినా మళ్లీ అప్పీలంటూ వురటుందా! ఇదెప్పటికి తేలేను?"

"ఇంకో ఏడాదిలో తేలుతుందంటారా?"

"ఏడాదా! ఏడాదంటే కోర్టువారి నిర్వచనంలో

నెలన్నమాట, తెలిసిందా? అంత తొందరపడేవాళ్ళు అసలు కోర్టులకు రారాదు. పడిగాపులు కాస్తూవుంటే ఎప్పుడో మోక్షంకలుగుతుంది. అంతవరకు ఓపికపట్టి వుండాలి అప్పుడు వచ్చేదేమిటో చచ్చేదేమిటో? అప్పటిపరిస్థితులు ఎట్లావుంటాయో? పాపయ్యకు నేనుచెప్పా. 'రైతులు రాజీకి వస్తామంటున్నారుగదా అటోయిటో తేల్చేసి రాజీపడండి' అని. 'ఆస్తంతా పోయినా ఫరవాలేదుగాని నేను వాళ్ళతో మాత్రం రాజీపడ' నంటూ కూర్చున్నాడు. 'సరే నీఖర్మ! ఎట్లాజరగాలో అట్లా జరుగుతుందిలే' అన్నాను. సరి పోయింది. ఈసారికవిపిస్తే నాదగ్గరకుపంపించు. నేను చెపు తాన్లే ఆయనకు సమాధానం!"

"బాగానేవుంది. ఆయనింకా రెండుమూడునెలల్లో తేలిపోతుందని అనుకు టున్నట్టున్నాడు."

"అసలువిషయం చెప్పకునాయనా! గుండె ఆగి చచ్చిపోతాడు." గట్టిగా పొడుంపట్టాడు రమణ.

"ఏమండి! రామయ్యగారి స్టే పిటీషన్ ఈశలవులయిన తర్వాత తీసుకుంటారంటారా!" వృత్తిలో శ్రద్ధచూపిస్తు న్నాడు చంద్రం.

"ఆ! అదీ అంతంతమాత్రమే! స్టే యివ్వటం తేలికే. ఏవో నాలుగు గ్రౌండ్స్ పెట్టంగానే 'దట్సాల్ రైట్' అంటారు సరిపోతుంది. మరి స్టే వకేట్ చెయ్యాలంటేనే వస్తుంది తంటా?"

"అదిమాత్రం ఏమంత కష్టమండీ? ఫిజ్లీ గ్రౌండ్స్ అని ప్రూవ్ చేస్తే సరిపోదూ?"

"అయ్యోరామ! ప్రూన్ చెయ్యద్దుటయ్యా! ఈ ప్రొఫెషన్ అంటే ఏమనుకుంటున్నావ్? లా పుస్తకంచూసి అక్కడ అప్పచెప్పటమా? మహా అఘాతంలాంటిది. ఒక సారి దిగామంటే మళ్ళా పైకిరావటం బహుకష్టం. జూనియర్ అడ్వకేటుగాను, సీనియర్ అడ్వకేటుగానూ, ఆయనేడజ్జిగానూ, మళ్ళీ రిటైయిరనతర్వాత ఆవ్యక్తినే చూశాను. ఇట్లా నాకళ్ళముందు ఎంతమంది అడ్వకేట్సు జెడ్జెస్ కాలేదు! ఎంత మంది రిటైరు కాలేదు! మనమల్లాచూస్తూవుండాలి అంతే. నోరు మెదపకూడదు. చూస్తూవింటూవుంటే మన జ్ఞానం అభివద్ధి అవుతుంది. మాట్లాడామంటే నలుగుర్లోనూ చులకనయి పోతాం. యిదే గమ్మత్తు. ఈ ప్రొఫెషన్లో నేను వున్నానంటే వున్నాను. అంతే! దానికి ప్రశ్నలేదు, సమాధానం లేదు. ఏదో మొదట్లో చేరాను. భుజంగరావుగారితో పరిచయం అయింది. ఇద్దరం కలిసి పనిచేశాం. మా యింటి విషయాలుకూడా అంత అనుకూలించి రాలేదు. ఇట్లాగే పడివున్నాను. యింకా యెక్కడికీ వెళ్ళే అవకాశంలేక. ఈ ప్రొఫెషన్‌కు రిటైర్‌మెంట్ లేదుగా!"

"అయితే ఏమండీ! మీరు చాలా డిస్కరేజింగ్‌గా మాటాడుతున్నారు నాకేమీ లాభం లేదంటారా!"

"ఛా! ఛా! మాబోటి వృద్ధజంబుకాలవిషయం చెప్పానేగాని. నీకేమిటి! కుర్రాడివి. వృద్ధిలోకి రావలసిన వాడివి. నీకు మంచి భవిష్యత్తువుంది. హానెస్టీ ఇంటెగ్రిటీ, యీ ప్రొఫెషన్‌లో ముఖ్యమైనవి. మొట్టమొదట్లో తప్పుకోలేక కక్కుర్తిపడతారు. వాళ్ళు పూర్తిగా దెబ్బతింటారు.

ఓపికపట్టి నిలదొక్కుకున్నాడా యిక యీ ప్రొఫెషన్‌లో అలాంటివాడికి తిరుగులేదు. ఈనాడు భుజంగరావుగారు యీస్థితికి వచ్చారంటే ఆయన పేషన్సే కారణం."

తాను అంతఓర్పుతో పనిచేయకలుగుతానా అన్నట్టు ఆలోచనగా చూస్తున్నాడు చంద్రం

"మన పంతులుగారితో సాటి యెవ్వరూ రారు. ఆయనంత గంభీరమైన మనిషిని నేనవుతే ఇంతవరకూచూడలేదు చిరునవ్వు చిందిస్తూవుంటాడు. ఎంత ఆదుర్దాతో వచ్చినా ఆయన్ను కూర్చోబెట్టి తాపీగామాట్లాడి, ఆయన ఆందోళనను చేత్తోతీసేసినట్లు తీసేస్తాడు. అందుకనే క్లయింట్సు యీయనంటే ప్రాణంవిడుస్తారు! ప్రొఫెషన్లో ఆయనదగ్గర నేర్చుకోవలసినవి చాలావున్నాయి. క్రమక్రమంగా నీకే తెలుస్తుంది. నేను చెప్పక్కర్లేదు!"

చెవులు పెద్దవిచేసుకుని వింటున్నాడు చంద్రం.

"పాపం, ఆ యిల్లాలుకూడా ఆయనకు తగ్గవ్యక్తే. గంభీరంగానూ, గుంభనగానూ, కాపరం సరిదిద్దుకుంటూ వస్తోంది. ఇంటివ్యవహారాలన్నీ ఆమెగారే చక్కబెట్టుతూ వుంటుంది. ఆయనకు ఆప్రొఫెషనేమిటో, తనేమిటోఅన్నట్లు వుంటాడు. ఏవిషయంలోనూ జోక్యంచేసుకోడు. సక్రమంగా జరిగిపోతున్నవాటిని చూసి లోపల సంతోషపడతాడు అంతే! పాపం ఆమెగారు సతమతమవుతూ వుంటుంది. అయితే నేను కేవలం వృత్తిరీత్యా ఆయనింటికి వెళ్ళటం కాదు. ఆకుంటుంబానికి నాకు అవినాభావసంబంధం ఏర్పడిపోయింది. నేనువేరు, వాళ్ళువేరూ అని యెన్నడూ అనుకో

లేదు. నాకు స్వర్ణ ఒక్కర్తే కూతురు కాదు. అఖిల, కమల బాధ్యతలుకూడా నానెత్తిమీదే ఉన్నాయి. పంతులుగారికి తెలుసు నా బాధ్యత నేను నిర్వర్తిస్తానని. బహుశా అందుకనే వారు యింటివిషయాలు అట్టే పట్టించుకోనట్టు కనిపిస్తారేమోకూడా!"

తలవంచుకున్నాడు చంద్రం. ఈమాటల్లో అతనికి యెక్కువ అభిరుచివున్నట్లు కనపరచ లేదు.

"నేనిప్పుడు నా బాధ్యత నిర్వహించుకోవటానికి వచ్చాను!" బింకంగా అన్నాడు రమణ.

చప్పున తలెత్తిచూశాడు చంద్రం.

"నీమీద పంతులుగారికి మంచిఅభిప్రాయం కలిగింది. నువ్వంటే ఆయన బాగా లైక్ చేస్తాడు. పెద్దమ్మాయి పెళ్ళి విషయమై అక్కగారు తొందరపడుతున్నారు. ఈడూజోడూ బాగావుంటుందని మాఅందరి అభిప్రాయం!"

గుటకలువేస్తూ హఠాత్తుగా నిలబడిపోయాడు చంద్రం. ఈవిధమైన మాటల్ని స్వీకరించటానికి తయారుగా లేడు.

"కూర్చో, వివాహంఅనేది వ్యక్తిగతమైన విషయం. దీనికీ నీవృత్తికీ సంబంధంలేదు. కేవలం భుజంగరావుగారి దగ్గరకు వచ్చావుకనక అంటున్నమాటలు కాదూ. రెండూ విడివిడిగా ఆలోచించుకోవచ్చు."

"క్షమించండి! బలవంతంచెయ్యకండి. అసలు ఈ విషయం మాట్లాడటమే నా కిష్టంలేదు. దయచేసి మళ్ళీ ఆ

ప్రస్తావన తీసుకురాకండి." ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు చంద్రం.

"అంటే!"

"అదంతే మరి!"

"నాకు అర్థం అయ్యేటట్టు చెప్పు మరి!"

"నేనిప్పుడు పెళ్ళి చేసుకోదలుచుకోలేదు లెండి-"

తప్పించుకునే సమాధానంగా కనిపించింది రమణకు.

"ఇప్పుడు అనే మాటకు అర్థం లేదు. ఇప్పుడు కాకపోతే యింకొకప్పుడు, అంతేగా!"

"అప్పటిమాట చూసుకుందాం లెండి!"

"ఇట్లా తప్పించుకున్నట్లు మాట్లాడద్దు. సూటిగా సమాధానం చెప్పు. నాలోనే వుంచుకుంటాను! నేను నీదగ్గర తీసుకున్న చనువు నువ్వుకూడా నాదగ్గర కనపరచాలి!"

"కాదు లెండి!"

"అట్లా అంటే కాదు. నీదృష్టిలో యింకెవరైనా వున్నారా చెప్పు!"

కళ్ళు పైకెత్తి తీక్షణంగా చూశాడు. వసంత నవ్వుతూ కనిపించింది. ఇట్టే రమణవంక చూశాడు.

"దాంట్లో తప్పేమీ లేదు. ఎవరైనా వుంటే చెప్పు. నాకూ సంతోషమే!"

తటపటాయిస్తున్నాడు చంద్రం.

"మనం బాగా సన్నిహితులమయినాము. ఒకరి కష్టం సుఖం యింకొకరికి చెప్పుకోవటంలో తప్పేమీ లేదు. ఆడ పిల్లలవారం వచ్చి అడుగుతున్నాను. నాదగ్గర దాయాలిసిన

అవసరం ఏమీ లేదు. నాకూ ఒక ఆడపిల్ల వుంది. నేను ఓ నాడు ఎక్కడికో వెళ్ళి పిల్ల పెళ్ళిసంగతి ప్రస్తావించాలి. కాని నాకు అట్టే బాధలేదు. మా అమ్మాయి పెళ్ళినిగురించి నాకు దిగులు లేదు. ఆయిల్లాలు వెళ్ళిపోయినప్పటినుంచి, తల్లీ, తండ్రీ నేనుగానే కనిపించాను. మనస్సుఅనేది మహా చంచలమైనది. ఏవేమిటో అనుకుంటాం, ఏనేమిటో జరిగిపోతాయి. కాలం జరిగిపోయినకొద్దీ అన్నీ అడుగున పడిపోతాయి. మళ్ళీ తవ్వుకుంటేనే గుర్తుకొచ్చేది, బాధకలిగేది. నిజానికి నాకు ఒక్క ఆడపిల్లేకాదు. ఒక మగపిల్లవాడుకూడా వున్నాడు. ఇంట్లో పోట్లాడి వెళ్ళిపోయాడు. అప్పటికీ యిప్పటికీ ఎక్కడున్నాడో ఏంచేస్తున్నాడో ఎవ్వరికీ తెలీదు. ఆమె చచ్చిపోయి వెళ్ళిపోయింది. వాడు బతికివుండగానే కంటికి కనిపించకుండా వెళ్ళిపోయాడు. ఇంతేతేడా. నాదృష్టిలో యిద్దరూ ఒకటే అయ్యారు. ఎప్పుడైనా తలుపుకొస్తే కలుక్కుమంటుంది. నాతో పోట్లాడి వెళ్ళిపోయాడు. నేను మళ్ళీ పెళ్ళిచేసుకుంటానసే భయంతో వెళ్ళిపోయాడు. నాహృదయం బ్రద్దలుకొట్టి వెళ్ళిపోయాడు." చేతులు వణికేనాయి. పెదిమలు తడబడ్డాయి పెద్దగానిట్టూరుస్తూ "అయిపోయింది. ఇప్పుడేమనుకున్నా ప్రయోజనం లేదు. నా దుఃఖాన్నంతా కడుపులోదాచుకుని ఉక్కిరిబిక్కిరవుతున్నాను. 'అన్నయ్య ఎప్పుడువస్తాడు' అని అమ్మాయి అడిగినప్పుడల్లా నాగుండె పగిలిపోయినట్లనిపించేది. అదీ మరిచేపోయింది. నేనూ మరిచిపోవటానికి ప్రయత్నంచేస్తున్నాను. నాకే దిగులూ లేదు. ఇల్లు, ఉన్నపొలం, అమ్మాయి

పేరనే పెట్టేశాను. అదెక్కడికి వెళితే నేనూ అక్కడికే వెళతాను. ఏదో ఓనాడు రాలిపోతాను. అంతే! బ్రతికిన ఈ నాలుగురోజుల్లోనూ, పంతులుగారికుటుంబంకూడా సుఖంగా చూడాలని తాపత్రయం. వాళ్ళఆవేదన నామూలాన తగ్గితే నా కదేసంతృప్తి. పిల్లలపెళ్ళిళ్ళు అయిపోతే నేను కూడా చూసి సంతోషిస్తాను. నువ్వు నాకు బిడ్డంటివాడివి.'' చంద్రం రెండుచేతులూ గట్టిగాపట్టుకుని తల గిర్రున వెనక్కుతిప్పేసుకున్నాడు రమణ.

జవజవలాడిపోయాడు చంద్రం. నీరసించిపోయి అలసటగా ఆవేదనపడుతున్నాడు. రమణచెప్పిన ముక్కలన్నీ ఒక్కొక్కటే మననం చేసుకుంటూ ఆరాటపడుతున్నాడు. 'పాపం' అనుకున్నాడు. కళ్ళల్లో నీళ్ళు గిర్రునతిరిగినాయి.

ఒకర్నొకరు అర్థంచేసుకున్నట్లు సంతృప్తిగా చూశారు. తన మనస్సెటో పోయింది. తనవిషయంకూడా రమణకుచెప్పి కొంతవరకు అశాంతి తగ్గించుకుందా మను కుంటున్నాడు. తనలోనే యిముడ్చుకొని తనే బాధపడేదాని కంటె ఆత్మీయులముందు చెప్పితే కొంచెం ఉపశమనం కలుగుతుందనే రమణభావన చంద్రానికీ కలిగింది.

''నేను ఈవృత్తిలోకి విచిత్రమైనపరిస్థితుల్లో వచ్చిపడ్డాను. ఇన్‌కమ్‌టాక్సుడిపార్టుమెంటులో అదృష్టవశాత్తు ఉద్యోగందొరికింది. ఆ ఉద్యోగం దొరకటానికి పడరాని పాట్లు పడ్డాము. ఎంతో సిఫార్సు తీసుకురావాలిసివచ్చింది. మానాన్నగారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని ఉన్నపొలం కాస్తా అమ్మేశారు. నాచదువే అతికష్టంమీద సాగింది.

చదువు అయినప్పటినుంచి మానాన్నగారు నా ఉద్యోగం కోసమే తపనపడ్డారు. రాజకీయుఖైదీగా వచ్చిన అయిదు ఎకరాల పొలంమీద వచ్చేరాబడే మా ఆధారం. ఎట్లాగైనా మానాన్నగారు ప్రముఖజాతీయవాది అని పేరుపొందటంవలన నాకు ఉద్యోగంవచ్చింది. ఆయనెంతో ఆనందపడిపోయారు. కాని ఆయనఆనందాన్ని నేను ఎక్కువకాలం ఉంచలేక పోయాను. అసలు నాకు ఏఉద్యోగంచేయటమూ యిష్టం లేదు. అయితే ఇంకో పని చేసేదికనిపించక మావాళ్ళను సంతృప్తిపరచటానికి ఉద్యోగానికి వప్పుకున్నాను అంతే. చేరినప్పటినుంచి జైలులో వున్నట్లుగానే బాధపడేవాడ్నే, ఎట్లా ఈ చెరనుండి విముక్తికావటమా అని ఆలోచిస్తూ వుండే వాణ్ని. నామనస్తత్వానికి ఉద్యోగానికీ సంతన లేదు. అయినా, చదువుకోవలసిన తమ్ముళ్ళున్నాడు. పెళ్ళికావలసిన చెల్లెలున్నది. నేను ఉద్యోగం చెయ్యటం తప్పినదికాదు. ఓనాడు మా మావయ్య మాయింటికి చుట్టంచూపుగా ఏ ఊరో వెళుతూ ఓ రెండుగంటలుంటానికి వచ్చాడు. ఆయనది పెద్ద హోదాగల కుటుంబం. డబ్బుంది, పదవివుంది, కమీషనర్‌గా వుంటున్నాడు. ఆయనముందు నేను వెళ్ళి నిలబడటానికి, నాకే చెడ్డ తలవంపులుగావుంది. ఎంత బంధుత్వమయినా, డబ్బుండే టప్పటికి వాటి నిర్వచనమే మారిపోతుందని నా దృఢవిశ్వాసము టూకీగా రెండు మాటలు మాట్లాడేమో లేదో అంతే. అంతకుమించి నాకు మాట్లాడటం యిష్టంలేదు. చటుక్కున ఏమంటాడోఅని భయం. మాఅమ్మ మహా భోళామనిషి. అదివరకు అన్నయ్యే

కదా అని చనువుగా మాట్లాడటం మొదలుపెట్టింది. నాకేమాత్రం యిష్టంలేదు. ఆయన పిసుక్కుంటున్నట్లు నేనవుతే పూర్తిగా గ్రహించాను. కాని నేనేమీ అడ్డు రాలేకపోయాను. 'అమ్మాయి పెళ్ళెప్పుడు చేస్తావురా' అన్నది మామూలుగానే. ఆయన కోరచూపు చూశాడు. నేను మండిపడ్డాను. మాఅమ్మ ఇంకా ఏమంటుందో అని భయపడ్డానుకూడా. నాభయం నిజమయింది. 'మావాడు ఉద్యోగంకూడా చేస్తుండె! చదువుకుంటేమాత్రం, పెళ్ళికి అడ్డంయేమిటి! ఈడూ జోడూ బాగుంటుంది.' అన్నది నవ్వుతూ. మామానయ్య మహా ఉగుడయిపోయాడు. కళ్ళు రెండూ పెద్దవిచేసుకున్నాడు. చివాలున లేచాడు, 'ఆ గుమస్తాకా యం బి బి.యస్. చదువుతున్న మా అమ్మాయిని యిచ్చేది' అన్నాడు. గిర్రునతిరిగి వెళ్ళిపోయాడు. నా ప్రాణం చచ్చినట్లు అనిపించింది. ఆక్షణంలో నాలోనిచైతన్యం నశించింది. మొద్దుబారిపోయాను. దిగ్భ్రమ చెందాను. మతి చలించింది. నాకేమీ కనిపించలేదు. గోడపట్టుకుని నిలబడి పోయాను. ఉబుకొస్తున్న ఆ వేదన సహించరానిదయినది. అగ్నిజ్వాలలు భగభగ మండిపోతున్నాయి హృదయంలో. ఇది భరించరాని అవమానం. అభిమానం బాగా దెబ్బ తిన్నది. తుకతుకలాడిపోయాను. ఎట్లాగైనా మామాంవయ్య అన్నమాటలకు ప్రతికారంచెయ్యాలని పట్టింది. ఏవిధంగా నైనా వసంతనే పెళ్ళిచేసుకోవాలని దృఢనిశ్చయం చేసు కున్నాను. నేను వసంతను పెళ్ళిచేసుకుంటే ప్రతీకారం తీర్చు

కున్నట్లు! దానికేం చెయ్యాలా అని ఆలోచించుకున్నాను. ఈగుమాస్తాగిరితో నా గౌరవాన్ని తీశేశాడు. ఎలాంటిపరిణామం వచ్చినాసరే, యీవుద్యోగం వదిలెయ్యాలని బుద్ధి పుట్టింది. ఈవిషయమేకనక మానాన్నతో చెపితే ఒక్కనాటికీ ఒప్పుకోడు. నాకు తెలుసు. అందువల్లనే నాలో నేను ఎంతో మథనపడి ఓ శుభముహూర్తాన ఉద్యోగానికి రాజీనామాయిచ్చాను. అంతవరకు మావాళ్ళకు తెలీదు, 'నేను స్వతంత్రంగా న్యాయవాదవృత్తి స్వీకరిస్తాను' అని. మా నాన్నగారితో యెంతచెప్పినా ఆయన సమాధానపడలేదు. ఆనాడు వాళ్ళెంతబాధపడ్డారో యిప్పుడు నేను మాటలతో చెప్పలేను. ఊపిరిసలపకండా తిరిగాను. అనేకమందిని ఆశ్రయించాను. చిట్టచివరకు రామస్వామిగారు సిఫార్సు ఉత్తరం యివ్వటం, అదితీసుకుని భుజంగరావుగారిదగ్గరకు రావటం, వారు నాకోరికను మన్నించటం జరిగిపోయినాయి. నా అదృష్టంకొద్దీ మీబోటివారితో పరిచయం అయింది. మీరు నామీదచూపిస్తున్న ఆదరాభిమానాలకు సర్వదా కృతజ్ఞుణ్ని! ఇప్పుడు నేను ఈవృత్తిలో కొంచెం నిలబడటం, వసంతను పెళ్ళిచేసుకోవటం. ఇది నా నిశ్చితాభిప్రాయం! దానికోసమే రాత్రింబవళ్ళు ఆలోచిస్తూవుంటాను. మీరు నా హితంకోరేవారు కాబట్టి యీవిషయం అంతా మీముందరే పెట్టాను. ఇంతకుమించి నేను చెప్పేదేమీ లేదు" మొహమంతా జేబురుమాలతో గట్టిగా తుడుచుకున్నాడు. చొక్కా కాలరును ఎడంచేత్తో యిందుకులాగి, విసినకర్రతో గబగబ విసురుకుంటున్నాడు.

అన్నీ శ్రద్ధగా వింటూ కూర్చున్నాడు రమణ. నోట మాటలేదు. నిర్విణ్ణుడయిపోయినాడు. ఆ సమయంలో ఆతను యేమిమాట్లాడాలో అర్థంకాలేదు. ఏమి మాట్లాడాలో తెలియనప్పుడు మౌనమే ఉత్తమపద్ధతి అన్నట్లు మూకీభావం వహించి ఊరుకున్నాడు రమణ. దీన్ని గురించి ఏమంటాడో అని ఆదుర్దా వెలిబుచ్చిన చంద్రానికి పూర్తిగా నిరుత్సాహం కలిగింది. ఈ విషయాలు అన్నీ చెప్పటంవలన ఆయన మనస్సు సంతోషపెట్టకలిగాడో లేక బాధపెట్టాడో అర్థంకాక దిగాలు పడి చూస్తున్నాడు. చంద్రం మొహంలోకి తీక్షణంగా ఒక్క సారిగా చూసి మెల్లిగా లేస్తూ 'యికవస్తా' అన్నాడు రమణ. చంద్రంకూడా ఏమీ అనలేకపోయాడు. ఆపటానికి ప్రయత్నించనూలేదు. వెళ్ళిపోతున్న రమణవంక ధ్యానంగా చూస్తూ నిలబడిపోయాడు చంద్రం.



# 7

ఆనాడు భుజంగరావుగారి జన్మదినం. సరిగ్గా ఏభై ఏళ్ళక్రింద యిదే తారీఖున యిదేనెలలో కావమ్మ, సుందరామయ్యదంపతులకు ఆఖరిబిడ్డగా జన్మించాడు. తనకు బాగా వయస్సురాకమునుపే తల్లితండ్రులిద్దరూ గతించటం, పెద్దన్నగారి సంరక్షణలో పెరగటం జరిగింది. ఒకకాలానికి ఎక్కడివారక్కడ చెదిరిపోయారు. తలొక కుటుంబాన్ని సృష్టించుకుని, అన్నదమ్ముల, అప్పచెల్లెళ్ళ బంధాలు తెగతెంపులు చేసుకున్నట్లు, విడివిడయిపోయారు. ఎవరికుటుంబంలో వారు పూర్తిగా మునిగిపోయారు. భార్యాబిడ్డల సన్నిహితత్వంలో, తోబుట్టువుల అనుబంధం సన్నగిలిపోయింది. తిరిగితిరిగి భుజంగరావుగారు యీ వూరు స్థిరపరుచుకోవటం, ఇల్లంటూ ఏర్పరచుకోవటం, నలుగురినోళ్ళల్లో పడటమూ జరిగిపోయింది. ఆయనను కేవలము వకీలనిమాత్రమే గౌరవించటంకాదు. బహుముఖంగా ఆయనసేవ ప్రజాబాహుళ్యానికి లభిస్తూనేవుంది. మునిసిపల్ వ్యవహారాలలో ఆయన జోక్యంచేసుకోనందే యేపనీజరగదు. మునిసిపల్ పార్కు నిర్మించింది ఆయన. టౌన్ హాల్ కట్టించిందీ ఆయనే! పిల్లలకు హాస్టలుకావాలని గట్టి పట్టుపట్టిందీ ఆయనే. ఊళ్ళో ఎన్నోవీధుల్లో తారురోడ్లువేయించగలిగాడు చక్కటి గ్రంధాలయం ఏర్పరిచాడు. నెలనెలకు సాహిత్యగోష్టిఅంటూ ఏర్పరచి, నలుగురు సాహితీపరులను దగ్గరగాచేర్చింది మొట్టమొదట భుజంగరావుగారే!

ఆనాడుఉదయం ఆయనింటికి రకరకాల వ్యాపకాల వాళ్ళు తీర్థప్రజగా వస్తున్నారు. జన్మదిన శుభసమయాన శుభాకాంక్షలను, అభినందనలను తెలియచేస్తున్నారు. నిరాడంబరంగా ఒక ధోవతి, లాల్చి వేసుకుని, సన్నటి పైనఉత్తరీయాన్ని కుర్చీకితగిలించి. వచ్చేవాళ్ళను చిరునవ్వుతో స్వీకరిస్తున్నాడు భుజంగరావు. అనేక మంది అనేకరకమైన పొగడ్తలు వినిపిస్తున్నారు. ఆయనకు ముఖస్తుతి గిట్టదు. అయితే వాళ్ళు కేవలం వచ్చి నిజాలు చెపుతున్నారనిమాత్రం లోపల లోపల సంతోషంగానేవుంది. ప్రక్కగదిలో వాగేశ్వరి తొంగి తొంగిచూస్తూ, తనభర్త గౌరవప్రతిష్టలకు మురిసిపోతోంది. ఆమె పదిమందిలో భర్తదగ్గరగావచ్చి నిలబడేధైర్యంలేదు. ఈసమయాన ఆమెకూడా తనదగ్గరేవుండాలని పంతులుగారి అభిమతం. దీన్ని ఆమె తెలుసుకోకపోతే, చెప్పటానికి ప్రయత్నించడు. పిల్లలు యింట్లో గంతులువేస్తున్నారు. తండ్రి దగ్గరకువచ్చి తెచ్చినబహుమతులు, వచ్చినమనుష్యుల్నిచూసి ఆనందపడుతున్నారు. అఖిల, కమల ఇద్దరూ గదిలోకూర్చుని, ఒకతోఒకరు మాట్లాడకండా తండ్రినిచూసి ఎవరిలోవారే సంతోషపడుతున్నారు. వస్తున్నదెవరో, ఏమేమితెస్తున్నారో ఎవ్వరికీ పూర్తిగా అంతుపట్టటంలేదు. అయితే భుజంగరావు గారుమాత్రం వచ్చిన ప్రతివ్యక్తికి తనకూ గల సంబంధాన్ని యిట్టే స్ఫురణకు తెచ్చుకోగలడు.

వాణిజ్యసంస్థవారు వర్తకసంఘంవారు, తెచ్చిన బహుమతులను స్వీకరించటంలోనూ అంత తబ్బిబ్బుకాలేదు. బార్ఎసోసియేషన్ వారు అభినందనలను తెలుపుతున్నప్పుడూ

అంత ఉద్వేగపడలేదు. పురప్రముఖులు వచ్చినప్పుడూ, అంత ఆవేశపడలేదు. కాని ఒకపిల్ల పడుచుదనానికి ఎగబ్రాకుతున్న ఒక ఆడపిల్ల వెండిబుట్టలో గులాబి రేకులు తీసుకువచ్చి మందగమనంగా వస్తూ చెదరనికళ్ళలో శరీరంలో భయాన్ని దాచుకుని భుజంగరావుగారి చేతికి అతివినమ్రంగా అందించినప్పుడు మాత్రం దాన్ని స్వీకరించటంలో ఆయన మైమరచాడనే చెప్పాలి. అమాంతం లేచి ఎంతో ఆప్యాయంగా, ప్రేమగా ఆ బుట్టను తీసుకోవటంలో ఆ చిన్నమ్మాయి చేతుల్ని ముద్దుగా తాకాడు. 'మా అమ్మ కానుకగా పంపించింది' అన్న సన్నటి మాటలు ఆయనకు మాత్రమే వినబడేలాగున వున్నాయి. ఆ సాహసానికి ఎవ్వరూకూడా ఆశ్చర్యపడలేదు. 'ఎవరూ యీ పిల్ల' అనే ప్రశ్నమాత్రం క్షణకాలంలో ఉదయించి మాయమయిపోయింది. సమాధానం తెలిసిన రమణ మెల్లిగా జారుకున్నాడు. ఇక బైటనుంచి వచ్చే వ్యక్తులు తగ్గిపోతున్నారు. చెదురువాటుగా వస్తూనే వున్నారు. వీళ్ళందర్నీ చూస్తూ అచ్చెరువుపడిపోతున్నాడు చంద్రం. 'ఇంతమంది యిన్ని కానుకలు చెల్లించుకున్నారు. మరి నేను ఏమివ్వాలి' అనుకున్నాడు చంద్రం.

భుజంగరావుగారు బాగా అలసిపోయాడు. అభినందనల బరువుతో పూర్తిగా కుంగిపోయాడు. గంభీరంగా లేచి నిలబడ్డాడు. పిల్లలు నలుగురూ వచ్చారు దగ్గరకు. ఆయన్ని చూసి రమణ తన మనస్సులో తబ్బిబ్బులయినాడు. పైకి చెప్పటానికి చేతకాక మౌనంగా వుండిపోయాడు. 'ఈవిధంగానే

యీజన్మ వెళ్ళిపోవాలి' అని నిశ్శబ్దంగా భగవంతుణ్ని ధ్యానించింది వాగేశ్వరి.

రాత్రికి డిన్నర్ పార్టీ ఏర్పాటుచేశారు. ప్రొద్దు జారి పోతోంది. ఇంట్లోవాళ్ళు హడావిడిపడుతున్నారు. రమణ కయితే ఊపిరిసలపటంలేదు. చంద్రం సతమతమవుతూనే వున్నాడు. ఇక ఆడవాళ్ళవిషయం చూడటానికయితే స్వర్ణ, కమల వుండనేవున్నారు. నాలుగుసార్లుపిలుస్తే ఒకసారి ఊఁ అంటుంది అఖిల అంతే. ఆమెకు పెద్ద ఉత్సాహంగా కన బడటంలేదు. తల్లిఅవుతే బాగానేకోప్పడింది. 'నలుగురూ కళకళలాడుతూవుంటే, నవ్వొక్క దానివి మూతిముడుచుకుని యిట్లావుండటం ఏమీ బాగాలే'దని. ఈముక్కన్నతర్వాత, అఖిలమనస్సులో ఏమాలోచనవచ్చిందో ఏమో తానూ గబ గబ లేచి మొహంరుద్దుకుని చక్కగా బొట్టుపెట్టుకుని కొత్త చీరె కట్టుకుని పెళ్ళికూతురులాగ యిట్టే తయారయి వచ్చే సింది. వాగేశ్వరి కూతుర్నిచూస్తూనే మురిసిపోయింది. తన మనస్సులో ఏవేవిటో ఆలోచనలు వచ్చిపడ్డాయి. ఇంట్లో నలుగురూ సరదాగా కదలిపోతున్నారు ఆడా, మగా విచ క్షణా లేకుండా. వచ్చేవాళ్ళవిషయం, యింట్లోతయారయిన పదార్థాలనుగురించిన చర్చలు జరుగుతూనే వున్నాయి. క్షణంలో చంద్రం, రమణ యిద్దరూ కనిపిస్తారు. ఇద్దరిపెది మలు మెల్లిగా కదులుతూవుంటాయి, మరుక్షణంలో రమణ వాగేశ్వరితో ఏదో సంపదస్తాడు రెండోక్షణంలో చంద్రం, స్వర్ణ ఏవో మాట్లాడుకుంటారు. కమల, అఖిల యిద్దరూ

నవ్వుకుంటూ తిరుగుతున్నారు. రంగులరాట్నంలో వ్యక్తుల్లాగా గిరగిర తిరిగిపోతూనే వున్నారు. ఒక్కొక్కక్షణంలో ఒక్కొక్కజంట ప్రత్యక్షమవుతూ వుంటుంది. నలుగుర్నీ చూస్తూ వాగేశ్వరి పెదిమలు తడబడుతున్నాయి. ఇట్టే చంద్రం గభాలునవచ్చేసి, అఖిలప్రక్కనే నిలబడ్డాడు. సరిగ్గా అఖిల, చంద్రం బుజాలదగ్గరకువచ్చింది. అఖిల కొంచెంగా తలెత్తి ఏర్పాట్లసంగతి ముచ్చటగా మాట్లాడుతోంది. వాగేశ్వరి యీ యిద్దర్నీచూస్తూ తన్మయత్వంచెందింది. తన మనస్సులోకోరిక ఒక్కసారిగా తీరినట్లనిపించింది. కళ్ళార్పకుండా చూస్తూనే మొహం గంభీరంచేసుకుంది. ఇట్టే యిద్దరూ తలోకవైపుకూ చెదిరిపోయారు. చంద్రం గబగబవెళ్ళి 'ఇక్కడేంచేస్తున్నారు! ఓమూల అడవాళ్ళువస్తుంటే' అని స్వర్ణదగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు. చంద్రాన్నిచూసి స్వర్ణ నవ్వింది. టేబుల్‌మీదగ్లాసు తీసుకోవటానికి చెయ్యిజాపి ఆ గ్లాసు పట్టుకున్నదో లేదో పరధ్యానంగా చంద్రంకూడా ఆ గ్లాసువైపుకే చెయ్యిజాపాడు. ఆమెచెయ్యి మెత్తగా చల్లగా తాకింది. శరీరం గగుర్పొడిచింది. స్వర్ణ శరీరంలోకి విద్యుత్తు ప్రవహించినట్లయింది. అప్రయత్నంగా ఒకరిమొహం ఒకరు చూసుకుని మూగవాళ్ళయిపోయారు. చాటుగా రమణ చూస్తూ ఆనందబాష్పాల్ని ఉత్తరీయంతో మెల్లిగా తుడుచుకున్నాడు. ఆయనహృదయం నిండిపోయింది. వాళ్ళిద్దర్నీ చూస్తూ తనలోతాను లీనమయిపోయాడు. ఆయనమనస్సు

ఉప్పొంగిపోయింది. తల్లడిల్లిపోయాడు. మళ్లీ క్షణంలో తలో చోటుకు వెళ్ళిపోయారు.

రావలసిన అతిథులు చాలామటుకు వచ్చేసినట్టే. టేబుల్స్ నాలుగువరసల్లో ఏర్పాటుచేశారు. ఆడా, మగా కలిసి భోజనాలకు కూర్చోవటమే! సాధారణంగా భార్యాభర్తలతో వచ్చినవాళ్ళు వరసగానే కూర్చున్నారు. మొదటి వరసలో ఇంట్లోవాళ్ళందరూ కూర్చోవటానికి యేర్పాట్లు జరిగినాయి

నలుగురూ వచ్చి కూర్చున్న తర్వాత మెల్లిగా, భుజంగరావు చిరునవ్వు మొహంతో చేతులు జోడించుకుని వచ్చికూర్చున్నాడు. ప్రక్కనే హుందాగా వచ్చి వాగేశ్వరి కూర్చున్నది. భుజంగరావుగారి పక్కన రమణ నిబ్బరంగా కూర్చున్నాడు. ఆహ్వానాలు, అభినందనలు, చిన్నచిన్న పొగడలు పూర్తి అవుతున్నాయి.

స్వర్ణ వచ్చేసి తండ్రి పక్క కుర్చీలో కూర్చుంది రమణ అటూయిటూ చూస్తూ 'చంద్రం ఏం చేస్తున్నావ్ యింకా! వచ్చికూర్చో' అన్నాడు. చంద్రం గభాలున వచ్చేసి స్వర్ణ ప్రక్కన కుర్చీలో కూర్చున్నాడు. ఆమె తండ్రివైపుకు కాస్తంత జరిగింది. 'సిగ్గా? కూర్చోఅమ్మా అదేమిటి' అన్నాడు తండ్రి. సిగ్గుపడి మెలికలు తిరిగిపోయింది స్వర్ణ.

“ఏమండీ” అంటూ లోపల్నించి పిలుపువచ్చింది. చంద్రం వెనక్కితిరిగి చూస్తూ లోపలికివెళ్ళాడు. వడ్డనవిషయంలో ఏదో మాట్లాడుకుంటున్నారు వంటవాళ్ళు. అప్పటికే

చంద్రం అన్నిచేర్పాట్లూ చేశాడు. ఎవరెవరు ఏపని చెయ్యాలో కూడా నిర్ణయం అయిపోయింది. అయితే వాళ్ళల్లో వాళ్ళకు పొత్తుకుదరక చంద్రాన్ని పిలిచి మళ్ళీ మొదలుపెట్టారు.

"టైమయిపోయింది ఇక బయలుదేరండి" అంటూ ఓసారి అటూయిటూ చూశాడు చంద్రం.

ముసిముసినవ్వులు నవ్వుకుంటూ అఖిల మెల్లిగా వస్తోంది. అతన్ని చూసి నవ్వింది.

"ఇంకా యిక్కడే వున్నావే" అన్నాడు.

"ఊఁ" అంటూనే వెళ్ళి స్వర్ణ ప్రక్కనే కూర్చుంది. రమణకనుబొమలు ముడిపడ్డాయి. స్వర్ణ గుటకవేస్తూ కళ్ళు కుడివైపుకు తిప్పి అఖిలవంక అదోరకంగా చూసింది. నాగేశ్వరి వెనక్కు వెనక్కు చూస్తోంది అలజడిగా. భుజంగరావు అయితే గంభీరంగా తనకుర్చీలోనే కదలక మెదలక కూర్చున్నాడు.

'వడ్డనంతా పూర్తిఅయిపోయింది. ఇక తమరు భోజనాలు సాగించవచ్చు' అని చెప్పేసమయం వస్తోంది. చంద్రం లోపలివాళ్ళను ఒక్కసారిచూసి ఎవరెవరు ఏవేపునుంచి వడ్డించాలో మళ్ళీ చెప్పి చక్కా రావాలనుకున్నాడు. ఇట్టే తన కళ్ళు నిలిచిపోయినాయి. లోపలగదిలో అద్దంలో ఒక అమ్మాయి ప్రతిబింబం, కనులు అవి పోల్చుకున్నాడు.

"రమణా! ఏం చేస్తున్నావ్ యిక్కడా!" అంటూ గబగబ లోపలికి వెళ్ళాడు చంద్రం. చాలాదగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు.

కమల త్రుళ్ళిపడింది, పూలదండ పెట్టుకుంటూ వెనక్కు తిరిగింది, కమల మొహం చాలాదగ్గరగా చంద్రం మొహంలోకి వచ్చినట్టయింది. పెదిమలు తడబడ్డాయి. ఇద్దరి మొహాలు వెడల్పయినాయి.

“అయిపోయింది వసున్నా” అంటూ బయలుదేరింది. చంద్రంకూడా ప్రక్కపక్కనే నడుస్తూవచ్చాడు. చంద్రం మనస్సులో హఠాత్తుగా ఏదో ఆలోచనబయలుదేరి పూర్తిగా ప్రయాణంచెయ్యక, మధ్యలోనే తునిగిపోయింది. మళ్ళీ ఇట్టే తెలివితెచ్చుకుని వచ్చికూర్చున్నాడు అఖిలకుర్చీ పక్కన. అతని పక్కనే కమల కుర్చీలాక్కుని కూర్చుంది. రమణ తలను కొంచెం ముందుకుపోనిచ్చి చంద్రంవైపుకుచూసి చప్పరించాడు.

చంద్రం అటూఇటూ చూశాడు. రెండుపక్కల అఖిల, కమల కూర్చునివున్నారు. ఇట్టే అదిరిపడ్డాడు. ఇద్దరి మధ్య చిక్కుకునిపోయి యిరకాటంలో పడ్డట్టయింది. భోజనం చేస్తున్నంతసేపు, కళ్ళు రెండువైపులాపనిచేస్తూనేవున్నాయి. ఒదిగిఒదిగి కూర్చున్నాడు బెరుకుగా.

భోజనాలు సాగిపోతున్నాయి. ఎవరికివారు తమతమ మనస్సుల్లో ఆలోచించుకుంటూ యాంత్రికంగా చేతులు కదిలిస్తున్నారు.

# 8

చంద్రం పండువెన్నెల్లో పండుహృదయంతో పడు కున్నాడు. చుట్టూ పూలచెట్లు చిరుగాలికి ఊగిసలాడు తున్నాయి. అక్కడకూడ యిద్దరు ముగ్గురు జట్లుగా చేరి కూర్చుని తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటున్నారు. చిన్నపిల్లలు పగలులాగ అటూయిటూ తిరుగుతూ ఆడుకుంటున్నారు. పార్కంతా సందడిగా వుండిపోయింది. సన్నగా రేడియో స్వరం వీనులవిందుగా వినిపిస్తోంది. 'ఎంతహాయి యీవెన్నెల రేయి' అంటూ ఎవరో మధురంగా పాడుతున్నారు. చంద్రం, మనస్సు చలించినట్లయింది. తనచుట్టూకూడా ఎవరో ఆడవాళ్ళుచేరి తనను వింతవింతప్రశ్నలు వేస్తున్నట్లు ఊహించుకుంటున్నాడు.

భుజంగరావుగారింట్లో ఆనాడుజరిగిన డిన్నర్‌పార్టీ విశేషాలు యిట్టే స్ఫురణకువచ్చేసి హృదయాన్ని చక్కలి గింతలు పెడుతున్నాయి. తనలోతాను ఆనందపడిపోతు న్నాడు. ఆడపిల్లలతో సరదాగా కలిసిమెలిసి యింతవరకు తిరిగిందిలేదు. ఆనాటిసంఘటన మరుపురానిది. అనుకోకండా, ఏప్రయత్నమూ చెయ్యకండానే ముగ్గురుఆడపిల్లలు తనకు అతిసన్నిహితంగా వచ్చారు. ఏవేమిటో మాట్లాడుకున్నారు. ఆ హడావిడిలో తానేమిమాట్లాటాడో, వాళ్ళేమిసమాధాన మిచ్చారో వివరంగా తెలీదు. కాని, హృదయంవిప్పి కావలసిం

దేమిటో ఒకర్నొకరు అడగటం, ఆ నాసేపు నవ్వుకోవటం తెలియని ఆనందంలో మునిగిపోవటం జరిగిపోయింది. చంద్రానికి నిజంగా అదొక వింతఅనుభూతి. అతను దూర దూరంగా వెళ్ళిపోతూ తనమనస్సును వసంతమీద లగ్నం చేసి, అన్నింటిని మరిచిపోవటానికి ప్రయత్నంచేస్తున్నాడు. తానొక ప్రతిజ్ఞ చేసుకున్నాడు! మావయ్యఅన్నమాటలకు ప్రతీకారంచెయ్యాలని కృతనిశ్చయుడయివున్నాడు. ఎట్లా గయినాకాని వసంతనే పెళ్ళిచేసుకోవటానికి దీక్షపట్టాడు. ఈ నిర్ణయంలో తనకు యితరవిషయాలు ఆకర్షణగా కన బడకండా చేసుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అందువలనే ఆనాడు రవణవచ్చి, మెల్లిగా అడిగినప్పుడు కూడా నిర్మొహమాటంగా తనవృత్తాంతాన్నంతా చెప్పాడు. కాని తనమనస్సు అప్పుడప్పుడు ఊగిసలాడుతున్నప్పుడు గట్టిగా ప్రయత్నంచేసి అదుపులోకి తెచ్చుకుంటున్నాడు. ఆనాడు మాధవి తనదగ్గరకువచ్చి కూర్చున్నప్పుడు అదో రకపు ఆవేశంవచ్చి ఆవహించింది.

వీటన్నింటిని వెనక్కునెట్టేశాడు. వసంత స్టెత స్కోపుపట్టుకుని మానవులగుండెలు పరీక్షచేస్తోంది! వసంత పెద్దడాక్టరు. తనలోతాను నవ్వుకుంటున్నాడు. "నా హృద యాన్ని పరీక్షచెయ్యమనువచ్చి తెలుస్తుంది! కేవలం చదువు ఒక్కటె అన్నీ యివ్వలేదు. అంతకంటెమించినవి యింకా వున్నాయి. నే నెవరో యిప్పటికైనా, వసంత గ్రహించి వుంటుందా! నేను ఈనాడు ఓ ఆఫీసులో గుమస్తాకాదు ! తన వృత్తిమాటర, నాదకూడా స్వేచ్ఛావృత్తే! ఇక నేను

బయలుదేరుతాను. ప్రత్యక్షంగా వసంతనే అడుగుతాను. మావయ్య అడుపాజ్ఞలలో వుండాలసిన పనేమీలేదు." ఆలోచించుకుంటూనే చప్పున గతుక్కుమన్నాడు. వసంత ఎదురుగా నిలబడి "బావా ఏమయింది నీపని." అని వెక్కిరిస్తున్నట్టు కనబడింది. "వసంతకూడా యిష్టంలేదా! ఓ వేళ కాదంటే చేసేపని? బలాత్కారంగానైనా సరే పెళ్ళి చేసుకుని తీరతాను! ఏమిటో ఉద్రేకం! ఇదెట్లా సాగుతుంది. తీరా వసంత యిష్టపడకపోతే చేసేదేమిటి ! అట్లా ఎన్నటికీ జరగదు. ఇష్టపడితీరుతుంది! ఏమైనాగాని, పెళ్ళితీరాలి. స్వయంగానే యీవిషయాన్ని పరిష్కారంచేసుకోవాలి," తీవ్రంగా మధనపడుతున్నాడు.

తనచుట్టూ ఆడపిల్లలు తిరుగుతున్నట్లు చంద్రం భయపడిపోతున్నాడు. రమణ సామాన్యుడుకాదు. తనమనస్సు ఎన్నాళ్ళని బిగువుగావుంటుంది. సడిలిపోతున్నట్లనిపిస్తోంది. ఏసమయాన ఎలాంటి పరిస్థితి వచ్చిపడుతుందో అని భయంగానే ఉంది. తానవుతే ఒక నిశ్చితాభిప్రాయంతో వచ్చిన మనిషి. కేవలం లాయరువృత్తిమీద మమకారంతో కాదు. వసంతను ఎట్లాగైనా పెళ్ళిచేసుకోవాలనే గాఢమైనవాంఛ తనను యీవిధంగాచేసింది. వకీలువృత్తిలో రానురాను అభిరుచి యెక్కువయింది. దీంట్లో స్థిరత్వంవర్పడుతున్నకొద్దీ తన నిర్ణయాన్ని అమలుచెయ్యాలనే ఆవేశం ఎక్కువయిపోతోంది. చాటుగావెళ్ళి మేమిద్దరం పెళ్ళిచేసుకుంటే మావయ్యకాదు యింకెవ్వరైనా ఏమని అనగలరు! అలాంటి దొంగచాటుపని ఎందుకు ! నేను ఈనాడు గుమాస్తానికాదు.

మావయ్యొచ్చి వసంత పెళ్ళివిషయం అడగచ్చు. ఏమో ఆయనా పెద్ద అభిమానంమనిషి. వెనకాముందులాడితే మనమే తేల్చుకోవాలి. నన్నుగురించిన ఊహాలు, ఆలోచనలు యితరుల మనస్సుల్లో గట్టిగా నాటుకోకమునుపే, పెళ్ళి చేసుకువస్తే సరిపోతుంది. నా నిర్ణయానికి తిరుగులేదు. యిది జరిగితీరాలి. యెవ్వరితోనూ చెప్పక్కర్లేదు. అందరికీ ఆశ్చర్యకరమైనపని చేసిరావాలి. వసంత యిక్కడికివచ్చేటంతవరకు ఆమె ఎవరో తెలియకూడదు. రమణకుకూడా తాను పెళ్ళిసందర్భంలో వెళుతున్నానని చెప్పకూడదు. బింకంగా ఆలోచించుకుంటున్నాడు. స్వర్ణ, కమల, అఖిల ముగ్గురూ ఒక్కసారే ఫక్కున నవ్వినట్లనిపించి ఉలిక్కిపడ్డాడు. గభాలున లేచాడు. పార్కులోజనం పల్చబడిపోయారు. ఎవరో ప్రేమికులుగామాలు యింకా కూర్చునే వున్నారు. కబుర్లుచెప్పుకుంటూ సరదాగా నవ్వేస్తున్నారు. ఒక్కక్షణం వాళ్ళవైపుకుచూసి ముందుకుసాగాడు. చకచక రూముకు వచ్చేశాడు. తలుపుతాళంతీసి లోపల అడుగు వెయ్యబోతుండగా, ఓ కవరు కనిపించింది. చప్పున చేతిలోకి తీసుకుని, తలుపులురెండూవేసి లోపలకువచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

గబగబ చదివేశాడు. తనతండ్రి వ్రాసినఉత్తరం. చేతుల్లోఉత్తరం అట్లాగే వుండిపోయింది. కనురెప్పలు కదలకండా అట్లాగే నిలబడిపోయినాయి. అతనిమనస్సు స్తంభించింది. భూమంతా గిర్రున తిరుగుతున్నట్లనిపించింది. తూలుతూ గభాలున మంచంకు వరిగిపోయాడు. స్పృహ

తప్పినట్లయిపోయింది. కొద్దిక్షణాలదాకా తెప్పరిల్లలేదు. బలవంతంగా లేచి మళ్ళీ తండ్రి వ్రాసిన ఉత్తరాన్ని చదవటం మొదలుపెట్టాడు. మొదట చదివినముక్కలే. తాను నమ్మినా నమ్మకపోయినా తనకు దుఃఖం కలిగించినా, కలిగించకపోయినా అవేమాటలు!

"వసంతకు హిస్టీరియావచ్చింది. ఈఏడు పరీక్షలకు కూడా వెళ్ళలేదు. మావయ్యకుటుంబంమొత్తం దుఃఖసముద్రంలో మునిగివున్నారు. ముందు ఏమిజరుగనున్నదో ఏమో! 'ఎంతమార్పువచ్చింది' అనుకున్నాడు. గతమంతా కళ్ళకు కట్టినట్లుగా కనిపిస్తోంది. మావయ్య అన్నమాటలు పదేపదే చెవిల్లో గింగురుమంటున్నాయి. పాపం ఆయనెంత బాధ పడుతున్నాడో! వసంతకు హిస్టీరియా వచ్చిందంటే నమ్మలేకుండావున్నాడు. కాని తనతండ్రి వ్రాశాడు. ఏక్షణాన ఏది జరుగుతుందో ఊహించటంకష్టమే! ఇది నయమయ్యేజబ్బేనా? ఓవేళ తాత్కాలికంగా నయమయితేమాత్రం, మాటిమాటికీ ఫిట్స్‌వస్తూవుంటే యెట్లాగు! ఇప్పుడు మావయ్య తప్పకండా నాదగ్గరకువస్తాడు! ఛీ! అట్లా ఎందుకనుకోవాలి! కష్టాల్లోవున్నవాళ్ళను ఎగతాళిగా మాట్లాడుకోవటం కూడా తప్పే! ఇదీ ఒకందుకుమంచిదే. ముందుగానే తెలిసింది. తీరా పెళ్ళిఅయినతర్వాతవస్తే, జీవితాంతం మానసికబాధ పడాలసివచ్చేది. ఇప్పుడు మావయ్యను సాధించాలసిన అవసరమూలేదు, తానుపెట్టుకున్న శపథాన్ని పూర్తి చెయ్యాలసిన అవసరమూలేదు. రెండుఅవసరాలు, నాటంతటఅవే తీర్చుకున్నాయి. ఇక మావయ్యకుటుంబానికి

మనకు ఇంతటితో సంబంధం తీరిపోయింది. వాళ్ళమాట తలుచుకోనక్కర్లేదు. వసంతవిషయం ఆలోచించక్కర్లేదు. మనస్సులోంచి నెట్టివెయ్యాలి. మళ్ళీమళ్ళీ జ్ఞాపకంతెచ్చుకో నక్కర్లేదు. కాని మావయ్యకు నేను యావజ్జీవం కృతజ్ఞుణ్ణయి వుండాల్సిందే! ఆయనమూలానే నాకు యీనాడు, యీ స్వయంవృత్తిలో ప్రవేశంకలిగింది. నన్ను ఈసడింపుగా మాట్లాడానే' అనుకొన్నాడుకాని, తనకు తెలీకండా నాకు ఎంతవుపకారంచేశాడో ఆయన గ్రహించుకోలేదు! నిజంగా ఆయనకు ఉత్తరంవ్రాసి కృతజ్ఞతచెప్పుకోవాలి. 'ఈ సమయంలో ఏరకం ఉత్తరంవ్రాసినా సరియైనఅర్థం స్ఫురించదు. అసలే బాధల్లోఉన్నారు. ఈ రకమైన ఉత్తరం వ్రాయటం భావ్యంకాదు.' అని తనలోతానే సమాధానపడుతున్నాడు.

చంద్రం గంభీరంగా కూర్చుని వసంతను గురించే తీవ్రంగా ఆలోచించుకొంటున్నాడు. చిన్నప్పటినుంచి తెలుసు. ఒకరికొకళ్ళఎదుట ఒకరు పెద్దవారయ్యారు. చిన్నతనంలో చిలిపిచేష్టలు గుర్తుకొస్తున్నాయి. వయస్సొచ్చిన తర్వాత జరిగిన వలపుమాటలు మెసులుతున్నాయి. ఆ అందం, చందం, సొగసు, సొంపు, అన్నీ తనసొత్తే అనుకొన్నాడు. కాని మధ్యలో మావయ్యవచ్చి, అనరానిమాటలు అని మనస్సు విరిచేశాడు. అయితే ఎట్లాగయినా, మనసును మళ్ళీ సరియైనస్థానంలోకి తీసుకొద్దామని ప్రయత్నంచేశాడు. సాధ్యంకాలేదు. "విధినిర్ణయాన్ని ఎవరూకాదనలేరు. వసంతకింత ఘోరమైన అన్యాయాన్ని ఎందుకుచేశాడో అర్థం కావటంలేదు. పాపం పూర్తిగా అమాయకురాలు. ఎంతగా

ఆవేదనపడుతూంటోందో! ఎంత బాధపడుతూంటుందో! పాపం వసంత" అనుకొంటున్నాడు చంద్రం. ఆమెమీద వున్న ప్రేమంతా జాలిగా యిట్టే మారిపోయింది. ఆమె భావిజీవితాన్నిగురించి రకరకాలుగా ఊహించుకొంటు న్నాడు. నలుగురుకూడా ఎంతో అదృష్టవంతురాలు అనవల సినదిపోయి అంత దురదృష్టవంతురాలులేదు అని అంటారు. నిజమే! దురదృష్టంకాకపోతే ఈ జబ్బురావటం ఏమిటి! ఆమెనుగురించి రకరకాలుగా ఆలోచించుకొంటున్నాడు.

ఆ రాత్రంతా కంటిమీద కునుకులేదు. తన జీవితం ఆమె జీవితం, రెండు ప్రవాహాల్లాగా జోరుగా ప్రవహిస్తు న్నాయి నురుగులుకక్కుకొంటూ. ఈ రెండు ప్రవాహాలూ రెండు విభిన్నప్రదేశాలనుంచి బయలుదేరినా, ఎన్నెన్నో దార్లు తొక్కుతూ, చివరకు రెండూ ఒ కేచోటున కలిసే సమయం వస్తుందని అనుకొంటూవుండగా చిన్న అంత రాయం కలిగినట్లుంది. ప్రవాహం దారిలో కొంత మార్పు వచ్చినట్లు కనిపించింది. మార్గానికి అడ్డంవేసి, సహజంగా రెంటి కలయికకోసం చంద్రం ప్రయత్నించేశాడు. కాని ఈనాడు ఘోరమైన అంతరాయం వచ్చేసింది. కలుస్తున్నట్టే కనబడి, ఒక్కసారిగా తలోకవైపు చీలిపోయినాయి. రెండూ రెండువైపులా ప్రవహిస్తున్నాయి. ఇక వీటి కలయిక మధ్యలో లేదు. చివరకు సముద్రంలో కలియాల్సిందే!

తనకు ఎంతో దగ్గరగావచ్చినట్లే కనబడింది వసంత. తన జీవితంలో అంత సన్నిహితంగా రాగలవ్యక్తి మరొక

రని ఊహించలేకపోయాడు. గుండ్రంగా తిరుగుతున్న ఈ భూమిమీద, వ్యక్తులుకూడా తమాషాగా తిరుగుతూనే వుంటారు. ఈ ప్రదక్షిణాల్లో ఒకరికొకరు బాగా దగ్గరగా వచ్చినట్టు కనబడతారు. మళ్ళీ యిట్టే దూరమయిపోతారు. ఒక్కొక్కప్పుడు మళ్ళీ కంటికికూడా కనిపించనంతదూరం లోకి వెళ్ళిపోతారు. ఈ చిత్రవిచిత్రప్రకృతులు తమాషాగా వుంటున్నాయి. అతిసన్నిహితులు చాలా ఎడమయిపోతు న్నారు. ఎవరోవ్యక్తులు క్రమక్రమంగా దగ్గరకువస్తున్నారు. తన జీవితంలోకివచ్చి తొంగిచూస్తున్నారు. నిజమే! ఒక అపరిచితవ్యక్తిని హఠాత్తుగా తనదాన్ని చేసుకొని, ఒకరి జీవితంతో ఒకరు ముడివేసుకుని, యావజ్జీవం ఒకకర్నొకరు ఆకర్షించుకొంటూ, ఒకర్నిచూసి ఒకరు ఆనందపడుతూ వుండటం గొప్పకష్టమే! కాని ఇదే వివాహం! అందరూ చేస్తున్నపని యిదే! కాని తనకు యిలాంటి కొత్త అను భూతి వస్తుందని అనుకోలేదు. తాను మొదఅనుంచీ చూస్తున్నవ్యక్తితోనే తనజీవితం ముడిపడుతుందని ఎంతో ఆశించాడు. కాని వసంత ఎడమయిపోయింది. బాగా దూర మయిపోయింది. మనస్సు ఊహించలేనంత దూరమయిపో యింది. ఆమెనుగురించిన ఆవేదన చంద్రాన్ని పూర్తిగా నిరుత్సాహపరిచేసింది. నీరసం తెచ్చిపెట్టింది. ఓ విధమైన భయంఆందోళన అన్నీ అవన్నీఅతన్ని క్రుంగదీసేస్తున్నాయి. తనకుకలిగిన నిరుత్సాహం ఒకఎత్తు. ఆమెకువచ్చిన ఆపద ఒక

యెత్తు. రెండూ సమానస్థాయిలో చంద్రంమనస్సు ఆక్ర మించుకున్నాయి. తీవ్రంగా దిగులుపడిపోతున్నాడు. ఆరాట పడుతున్నాడు. హఠాత్తుగావచ్చిన ఈవార్తను ఒడుదుడుకులు లేకండా స్వీకరించటానికి, సమాధానపడటానికి మనస్సు స్థిమితం చేసుకోవటానికి, తీవ్రంగా ప్రయత్నంచేస్తున్నాడు చంద్రం.



# 9

బరువెక్కిన హృదయంతో, చంద్రం మెల్లిగా మేడ మెట్లు దిగుతున్నాడు. సరాసరి భుజంగరావుగారిరూములోకి వెళదామనుకుంటుండగా, కమల చప్పున తండ్రిదగ్గరకు వెళ్ళటం చూసి. తాను పక్కగదిలోకివెళ్ళి పుస్తకం చేత పుచ్చుకున్నాడు.

మహాకోపంగా వెళ్ళింది కమల. తండ్రివంక చూసే టప్పటికి యీకోపం యింకా యెక్కువయినట్లనిపించింది. ఉక్రోషంకూడా వచ్చింది.

"నాన్నా!–" అన్నది గద్గదంగా.

తలెత్తిచూశాడు భుజంగరావు గంభీరంగా. 'కూర్చో' మన్నాడు.

"ప్రతిదానికీ అమ్మ నన్ను కోప్పడుతుందినాన్నా!– అక్కయ్య ఏంచేసినా ఏమీ మాట్లాడదు"– గొంతులో గీరవచ్చింది.

చప్పున వెనక్కు తిరిగి కళ్ళు అద్దుకుంటోంది.

"తెల్లారి లేచినప్పటినుంచి ఏదోమాట అంటూనే వుంది, నాకు మహాకష్టంగా వుంటోంది. మళ్ళీ తిరిగి అందా మని అనిపించేటంత కోపంకూడావస్తుంది. ఈమధ్యనుంచే మరీ ఎక్కువయిందినాన్నా" తండ్రిమొహంలోకి చూసింది.

ఆయనేమీ మాట్లాడటంలేదు. వింటూ కూర్చు న్నాడు.

"నాన్నా!..." కాంత తటపటాయించింది ముందు మాట అనటానికి.

"నాకు అమ్మ కాదా!... నేనుట!..." గాభరాలున భుజంగరావు తలెత్తి కళ్ళువిప్పుకుని తీవ్రంగా కూతురి మొహంలోకి చూశాడు. కమల భయపడిపోయింది. ఇంకా ఏమీ అనలేకపోయింది.

భుజంగరావుకళ్ళల్లో గతచరిత్రంతా తిరిగిపోతోంది.

వాగేశ్వరితండ్రి ఆనాడు పిల్లనిస్తానంటూ వచ్చినప్పుడు భుజంగరావు తటపటాయించాడు మొదట్లో. అటు కామేశ్వరి కళ్ళల్లోకి వచ్చికూర్చుంది. ఎన్నెన్నో ప్రశ్నలు అడుగుతున్నట్లనిపించింది. 'నా జీవితాన్ని నాశనంచేస్తావా' అని ప్రశ్నిస్తున్నట్టు కనిపించింది. ఇటు వాగేశ్వరిలో తనను వశపరుచుకునేటంత అందంవుంది. వయస్సులో మిసమిసలాడుతూ వుంది. బోలెడంత డబ్బుంగి. ఉద్రేకపడి కామేశ్వరిని పెళ్ళిచేసుకుంటే నలుగురూ నిందపెట్టడమేకాకండా, చివరకు సుఖపడేదేమీ లేదు. ప్రేమకు పెళ్ళికి ఎంతవరకు సంబంధం! ఆవేశంలో చేసిన వాగ్దానాల విలువేమిటి? తనలోతాను చర్చించుకున్నాడు. చివరకు నిర్ణయానికి వచ్చేశాడు. ఆనాడు వాగేశ్వరిమెళ్లో మంగళసూత్రం కడుతుంటే చేతులు వణికినాయి. తీరా ఆమెవంక చూస్తుంటే కామేశ్వరి రూపం కనిపించింది. గుండె గుభేలుమన్నది. కామేశ్వరిని పూర్తిగా మరిచిపోవాలని ప్రయత్నంచేశాడు. కాని గత అనుభవం అట్లా జరగనీయటంలేదు. అంతరాత్మ వేసే

ప్రశ్నలన్నింటికి తాపీగా సమాధానాలు చెప్పుకున్నాడు. కాని ఏక్షణంలో కామేశ్వరి ఎదురవుతుందోనని హడలి పోతూనేవున్నాడు.

ఓనాడు భయంకర స్వరూపంలో ఆమె ప్రత్యక్ష మయింది.

"మీరు నన్ను పెళ్ళిచేసుకుంటారంటే నమ్మలేదు. మీకు అంత సాహసం వుంటుందని ఎన్నడూ అనుకోలేదు. కాని మీరు నామీద చూపించిన ప్రేమ కలకాలం నిలిచి పోవాలి. అదే నేను కోరుకునేది." కామేశ్వరి పెద్దపెట్టున ఏడ్చింది.

భుజంగరావు కరిగిపోయాడు. అతని మనస్సు చలించింది.

కామేశ్వరి మనస్సు మహో తమోమయమైనది. ఆమె మనసారా భుజంగరావును ప్రేమించింది. తన అవ్యాజమైన ప్రేమలో తన శరీరాన్ని నిర్లక్ష్యంగా అప్పచెప్పేసింది. తనకు ఏ కోరికలూ లేవు. ఏ ఆకాంక్షలూ లేవు. భుజంగరావు తనను ఎప్పటికీ ఓ చల్లని చూపు చూస్తే చాలనుకుంది అంతే! ఆయనని పెళ్ళిచేసుకోకపోవడంవలన బాధపడిందేమీ లేదు. 'అందనిదానికి ఆశించి భంగపాటు పడ్డా' ననుకుంది. భుజంగరావును ప్రాధేయపడింది. తాను పెళ్ళి చేసుకుని భార్యతో సుఖంగా వుంటున్నా యింకో ఆడదాని ఆకాంక్ష కూడా తీర్చవచ్చు అనే భావన భుజంగరావు మనస్సులో

గాఢంగా నాటింది కామేశ్వరి. అతన్ని భోగలాలసుణ్ని చేసింది. అతని దృక్పథాన్ని పూర్తిగా మార్చేసింది.

వాగేశ్వరి భుజంగరావు మాట్లాడుకుంటున్న సమయంలో కామేశ్వరి గభాలున చనువుగా లోపలికి వచ్చేసింది. 'నీకు ఎన్ని సార్లు చెప్పాలి యిట్లా గదిలోకి రావద్దని' అంటూ గదమాయించాడు. కామేశ్వరికి కోపం అంటే ఏమిటో తెలియదు. ఎప్పుడూ పెదిమలమీద చిరునవ్వు తాండవమాడుతూనే వుంటుంది. భార్యాభర్తలిద్దర్నీ చూసి పకపకా నవ్వింది. వాగేశ్వరికి చురుమన్నది.

"పనిచేసేవాళ్ళే మీకు దొరకలేదేమిటి? వద్దంటుంటే దీన్ని ఎవర్తెనో తెచ్చిపెట్టారు" అంటూ విసుగుకుంది వాగేశ్వరి. ఆయన మెదలడు. ఎన్నిఅన్నా వూరుకుంటాడు.

కాలక్రమంలో వాగేశ్వరికి కళ్ళు తిరిగి గభాలున మండీగం మీదికి తూలిపడితే ఆ సమయంలో కామేశ్వరే వచ్చి ఆదుకుంది. క్రమంగా ఎంతో సహాయంగా వుంటూ వస్తోంది. తనకు ఎంత సహకారో వాగేశ్వరి గ్రహించటం ఎంతోకాలం పట్టలేదు. భర్త పట్టుపట్టి, కామేశ్వరిని పంపించేస్తానంటే వద్దని వారించింది మళ్ళీ తనే!

అఖిల పుట్టినప్పుడు కామేశ్వరి సంతోషానికి కూడా అంతులేదు. ఎంతో ఉప్పొంగి పోయింది. చేతుల్లోకి తీసుకుని తనను తాను మరచిపోయింది. తన కోర్కెను అఖిల మొహంలో చూసుకుని మురిసిపోయింది. ఒక్క నిముషం తల్లిదగ్గర నిలవనిచ్చేది కాదు. అస్తమానం తన చేతుల్లో

కదలాల్సిందే! కామేశ్వరి మన స్తత్వం, ఆమె అభిరుచులు, ఆమె ఆవేశం, యీనాటికికూడా భుజంగరావుకు అర్థం కాదు. ప్రేమ మయమైన జీవితం. ఆశదాని స్వరూపంలో వచ్చి, తన జీవితం మీద ఎంతో ప్రభావం తెచ్చిన ఓ శక్తి స్వరూపం!

'నేను కోరుకున్న సుఖంమీకులభించింది. మీసుఖాన్ని చూసి నేను ఆనందపడటమే కాని నాకు ప్రత్యేకమైన సుఖం లేకపోయింది' అంటూ ఎంతో దుఃఖపడింది కామేశ్వరి.

ఎంతో సముదాయించి చెప్పాడు భుజంగరావు. పెళ్ళి కాకుండా తల్లి అయితే వచ్చే పరిణామాలు అన్నీ చెప్పుకున్నాడు. కాని కామేశ్వరి తన పట్టు వీడలేదు.

"నేను ఈ లోకంలో ఎవ్వరినీ లెక్క చెయ్యను. నన్ను ఎవ్వరూ శాసించేవారు లేరు. నాకునేను సర్వ స్వతంత్రురాలను. నాకుకావలసింది యీనాడు పెళ్ళికాదు. ప్రేమ అంటే ఏమిటో తెలుసుకొన్నాను. ఈనాడు నా హృదయం ఓ పాపకోసం తహతహలాడుతుంటోంది. పాపకలిగితే చూసి హాయిగా కన్నుమూస్తాను." నిబ్బరంగా అన్నది కామేశ్వరి.

భుజంగరావు మనస్సు చివుక్కుమన్నది. కామేశ్వరి చెడుగా తలుచుకోవటం తనకేమాత్రం యిష్టం లేదు. ఆమె తన కళ్ళ ఎదుటనుంచి వెళ్ళిపోతుందంటేనే భయంగానూ, దిగులుగానూ, బెంగగానూ వుంది. కాని ఆమె పట్టుపట్టి కూర్చుంది. "నేనికా యిక్కడ వుండలేను. మీ రూపాన్ని

నా హృదయాంలో చేర్చుకుని వెళ్ళిపోతాను. నా చిహ్నముగా మీకో పాపను యిచ్చి వెళ్ళిపోతాను.” అన్నది.

“నా మూలానమీకు ఏవిధమైన మాటా రాకూడదు. నన్ను పదిమందీ ఏమన్నా పడగల ధైర్యం వుంది. మీకు అది లేదు. గౌరవం, మర్యాద, ప్రతిష్టలకు ప్రాకులాడాలసి వస్తుంది. నా మాట వినండి. నేనింకా యిక్కడ వుండలేను. అంటూ ప్రాధేయపడింది.

ఆనాడు సాయం సమయాన వాగేశ్వరి దొడ్లో సన్న జాజులు చూస్తోంది. కామేశ్వరి నీళ్ళబిందె పట్టుకుని మెల్లగా వస్తూ వస్తూ గుమ్మాలున నిలబడిపోయింది. గట్టిగా కళ్ళు మూసుకుని తూలింది. చేతిలోబిందె జారి క్రిందపడింది. గభాలున వాగేశ్వరి వచ్చి చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకుని వెళ్ళింది. ప్రక్క గదిలోనుంచి యీ చిత్రమంతా తాపీగా చూస్తూ కూర్చున్నాడు భుజంగరావు.

వాగేశ్వరి అడిగిన ప్రశ్నకు “నాకు నిన్న జ్వరం వచ్చింది. అందువలన నీరసించి యిలాతూలాను” అని అబద్ధ మాడింది కామేశ్వరి.

“ఇక నేను ఈ వూరు వదిలిపెట్టి వెళ్ళిపోతున్నాను” అని వచ్చి చెప్పినప్పుడు వాగేశ్వరికికూడా కళ్ళనీళ్ళు గిర్రున తిరిగినాయి. కష్టంలో ఆదుకుని ప్రతివిషయంలోనూ చనువుగావుంటూ తనకు యిన్నాళ్ళనుంచీ పెద్ద అండగానిల్చిన కామేశ్వరి వెళ్ళిపోతుందంటే నిజంగానే దుఃఖం వచ్చింది.

"పాప క్షేమంగా వుండాలి ఎల్లకాలం" అంటూ ఎంతో ఆప్యాయంగా అఖిలను దగ్గరకు తీసుకుని దుఃఖాన్ని ఆపుకోలేక బావురుమంది. వాగేశ్వరికికూడా దుఃఖం ఆగ లేదు. కలిసి మెలిసి తిరిగిన జీవితాలు విడివిడయి పోతు న్నాయి. కాలం, దూరం, ఆప్యాయతను అనుబంధాన్ని విడ దీసేస్తున్నాయి.

భుజంగరావు కొత్తలో బాగా దిగులుపడటలే కని పించాడు. ఓ సారి వెళ్ళొద్దామనే భావనకూడా కలిగి, యిక సంబంధం తీరిపోయింది. పూర్తిగా మరిచేపోవా లనుకుంటు న్నాడు. ఈ సమయంలోతనకు తెలిసినవార్త మనస్సును క్రుంగదీసేసింది. చైతన్యరహితంగా కూర్చున్నాడు. కామే శ్వరి అనాథ శరణాలయం చేరింది. ఆరోగ్యంబాగా చెడి పోయింది. డాక్టరు చూసి చప్పరించాడుటకూడా ఏమీ లాభంలేదని. చివర సమయంలో తానొకసారి వెళ్ళి చూడా లిసిన బాధ్యతవుందా లేదా అని పరితపిస్తున్నాడు. తన జీవి తంలోకివచ్చి తనను అత్యంత ప్రియమైన వ్యక్తిగా చూస్తూ జీవితంలో తొలి మధురానుభూతికి రూపం కల్పించి ఎన్నో కొత్తపాఠాలు నేర్పిన కామేశ్వరిని మళ్ళీ చూడ కలుగు తానా! అంటూ వ్యథ పడుతున్నాడు.

ఎట్లాగయితేనేం నిశ్చయం చేసుకున్నాడు వెళ్ళాలని. పెద్దశరణాలయం. ఎంతోమంది ఆసరా చూసుకున్నారు. దిక్కులేని వాళ్ళందరికీ యిదే ఆశ్రమం. కామేశ్వరి యీ ఆశ్రమంలో వుండాలిసి వచ్చింది. దీనికి బాధ్యులెవరు? నేను

కాదూ, నేను కాదూ? అని గుణించుకున్నాడు. గుండె నిబ్బరం చేసుకుని లోపలికి వెళ్ళాడు.

కామేశ్వరి మృత్యువుతో పెనుగులాడుతోంది. ప్రక్క పసిపిల్ల గుక్క పట్టి ఏడుస్తోంది. భుజంగరావు స్తబ్ధుడయిపోయినాడు. ఆమె కళ్ళు మూస్తూ తెరుస్తోంది. ఆయన ఆకృతి కనబడ్డట్టుంది. మెల్లిగా లేవబోయింది. ఆమె రూపు మహా భయంకరంగా వుంది. గజగజ లాడిపోయాడు. కొన ఊపిరిలో కొన్ని మాటలు దొర్లినాయి.

"వచ్చారా! మీరొస్తారని తెలుసు... నా కోరిక తీరింది... ఈ జీవితం మీద ఆశపోయింది... ఇదిగో మన పాప... కాదు... నే వెళుతున్నా. ఇక మీ పాపే... నా యీ రూపాన్ని మీ యింట్లో వుంచుకోండి... నేను మీ యింట్లోకి రాలేక పోయాను. ఈ పాపను మీ యింట్లోకి తీసుకోండి. చేతిలో చేయి వేయండి..." కామేశ్వరికి ఆయాసం బాగా ఎక్కువయింది.

భుజంగరావు ఆమె చేతిని తీసుకుని తన హృదయం మీద పెట్టుకున్నాడు. ఆమె తల వాల్చేసింది. ప్రక్కలో పాప కెవ్వుమంది.

భుజంగరావు త్రుళ్ళి పడ్డాడు.

"కమలా! నేనున్నాగా." నిబ్బరంగా అన్నాడు. కూతుర్ని దగ్గరకు తీసుకున్నాడు. తన మనస్సులోని ఆవేదన

ఆరాటం కూతురికి తెలియకూడ దని తపన పడుతు న్నాడు.

కమల తల పైకెత్తి బిత్తరపోయి చూసింది తండ్రి మొహంలోకి. ఆమె మనస్సులో ఎన్నెన్నో ఊహాలు జనించినాయి. తన మనస్సును పట్టేసిన సంఘటనలు గుర్తుకొస్తు న్నాయి.

"అవును నేను అక్కయ్యతో సమానం కాదు" అనుకుంది. కాని తండ్రిని చూస్తే అన్నీ మర్చిపోగల ధైర్యం వస్తోంది. ఆయన చూపుల్లో అంత ఆప్యాయత, విశ్వాసం కనిపిస్తున్నాయి.

పెద్ద నిట్టూర్పు విడిచింది. తేలికయిన హృదయంతో తండ్రి మొహంలోకి చూస్తూ నిలబడిపోయింది.



# 10

భుజంగరావు మనస్సు బాగా ఆందోళన పడి పోతోంది. ఆయన అనుకుంటున్న వేమీ సాగటం లేదు. కాని పైకి మాత్రం బింకంగానే వుండిపోతున్నాడు. అయితే మనస్సులోవ్యధమాత్రంఎక్కువయింది. అందులో రాజావిష యంలో మరీను. సుగుణమ్మ ఏకైక కొడుకును ఎట్లాగయినా శిక్షనుంచి తప్పించి తన అల్లునిగా చేసుకుందామని, విశ్వ ప్రయత్నం చేశాడు. తన చెప్పుచేతల్లో రాజా వుంటాడు గదా అనుకున్నాడు. ఈ విషయం ఎవరికీ చెప్పలేదు. ఆఖరి క్షణందాకా ఎవ్వరితోనూ చెప్పకూడదని కూడా అను కున్నాడు.

కాని ఆయన అహం పూర్తిగా దెబ్బతిన్నది. రాజాకు శిక్ష తప్పిందికాదు. దీంతో ఆయన కృంగిపోయాడు సహ జంగా గెలుస్తామనుకున్న కేసు ఓడిపోతే విచారపడే ధోరణి లోనే వున్నాడని రమణ, చంద్రం అనుకున్నారు. నాగే శ్వరి అడిగిందికూడా. 'యేమిటి వారట్లా వున్నారు' అని. "ఏం లేదు లెండి రాజాకు శిక్షపడింది. దాంతో నాకి మనస్సు చాలా బాధపడింది. సుగుణమ్మను చూస్తుంటే గుండె తరుక్కుపోతోందండి. పాపం యెవరు మాత్రం ఏం చెయ్యగలుగుతారు కనుక! మన చేతనయినదంతా చేశాం. యింతకీ అతని కర్మం ఎవరు తప్పించ గలుగుతారు!" అన్నాడు వైరాగ్యంగ.

తన అశాంతి, అసంతృప్తి యితరులు గ్రహించారని తెలుసుకున్నప్పుడుమాత్రం భుజంగరావు బింకంగానూ, హుందాగానూ మాట్లాడుతూ "పూర్ ఫెలో! పాపం, మన మేం చేస్తాం! అయినా కేసులో బలం లేదని మనం మొదటి నుంచీ అనుకుంటుందేగా! అయితే మధ్యలో మనకు కొంత ఆశకలిగింది. అంతకంటె ఏయేం లేదు." అనేశాడు.

రమణకూడా సంతృప్తిపడ్డాడు కాని చంద్రానికి బాధగానేవుంది. ఎంత ప్రయత్నంచేసినా రాజాను రక్షించలేకపోయానేఅని. క్రమ క్రమంగా రాజామాట మరుగు పడిపోయింది. భుజంగరావుకూడా కాని ప్రస్తావన తీసుకురాలేదు. దాన్ని పూర్తిగా విస్మరించినట్లే ప్రవర్తిస్తున్నాడు.

వాగేశ్వరిఅయితే పైకి అనేస్తోంది 'పిల్లల పెళ్ళిళ్ళు మాటేమిటండీ' అంటూ. మగవాడు అంత తేలికగా బైటపడటం కష్టం తానంత గొప్ప వకీలుకు అల్లుడుకావటానికి యోగ్యుడే వెతుక్కుంటూవస్తాడని ధీమా. కాని అఖిల ప్రవర్తన, తీరు చూస్తుంటే చెడ్డ కోపమూవస్తోంది. అసహ్యమూ వేస్తోంది. కాని గట్టిగా మందలించడంబాగుండదని ఊరుకుంటున్నాడు. చంద్రంవిషయంలో కాస్త శ్రద్ధచూపించాలేమో అనికూడా ఆలోచిస్తున్నాడు. ఏమయినా తనకు తానుగా చంద్రాన్ని తనకూతుళ్ల పెళ్ళిళ్లగురించి ప్రస్తావించదలుచుకోలేదు. రమణచేత అడిగించటం అంతకన్నా యిష్టంలేదు. తనమనస్సు తెలుసుకుని వాళ్ళే యేదోమాటల

సందర్భంగా తీసుకువస్తే బాగుండునని ముభావంగా వూరు కున్నాడు.

ఎప్పుడో వాగేశ్వరి రమణతో చంద్రంవిషయం ప్రస్తావించటం జరిగిపోయింది. అందులో అననూకూడా అన్నది. మీఅమ్మాయిఒకటీ మాఅమ్మాయిఒకటీ కాదు. ఎవత్తెనోఒకత్తెనే పెళ్లిచేసుకుంటాడుగాని, ముగ్గురిన్నీ కాదు గదా! అలాంటప్పుడు మిగతాయిద్దరికీ వేరేసంబంధాలు వెతకాల్సివస్తుంది చంద్రం అభిప్రాయమేమిటో కనుక్కున్న తర్వాత మన ప్రయత్నాలేమిటో చేసుకోవచ్చు" అన్నది.

చంద్రానికి యీముక్క చెప్పటంకూడాఅయింది మథనలో పడిపోయాడు. భుజంగరావుగారిఉద్దేశాలు యెట్లా వున్నాయో తెలుసుకోవటం మహాకష్టం. తాను యేది నిర్ణయించుకున్నా ఆయన మనస్సు నొప్పించకండావుండాలన్నా ఆయనమనస్సేమిటో తెలుసుకున్నతర్వాతకదా!

అదివరకిల్లా ఒకపద్ధతి. ఇప్పటిదారివేరు. పెళ్లిచేసుకోవటంలో ఓ నిశ్చయానికివచ్చినట్టే! ఇక్కడ చిక్కులు చాలాఅల్లిబిల్లిగా అల్లుకుపోయి ఎటూతెగక మొండిగా కనబడుతున్నాయి. అఖిలవిషయంలో తనమనస్సు స్థిరంగాలేదు. తనకు ఎక్కువసన్నిహితంగా కమల, స్వర్ణ వస్తున్నారు. అలాంటప్పుడు కమలను యిష్టపడేసందర్భంలో, పెద్దపిల్లకు పెళ్లికాందే, కమలపెళ్లివిషయం తీసుకురావటం సమంజసంగా లేదు. పైగా భుజంగరావుగారిదగ్గర డబ్బుపుచ్చుకోవటం అసంభవం. అడిగించటంకూడా అసమంజసమే. డబ్బులైతే

కావాలి. తాను స్వయంగా వృత్తిచేసుకుంటూ జీవనంగడపా లంటే కాస్త పెట్టుబడిరూపంగా డబ్బులేకపోతే సాగదు. పెళ్లిచేసుకున్నతర్వాత భుజంగరావుగారిదగ్గరే వుండిపోవటం తేలికగా వుంటుంది. డబ్బుఅడిగినా, అడక్కపోయినా రమణ కాస్తోకూస్తో ముట్టచెప్తాడు. ఒక్కఆడపిల్ల. అక్కడ ఎక్కువసౌకర్యాలు కనబడుతున్నాయి.

ఈమధనలో యెటూతేల్చకండా వుండిపోయాడు. తాను నిజంగా యిక్కడకువచ్చింది వృత్తికోసం. వివాహం కోసం కాదు. తననిర్ణయం తారుమారయింది. తాను తన మామయ్యమీద ప్రతీకారం తీర్చుకుందామనుకుంటుంటే, భగవంతుడే ఆయన్ను చిన్నచూపుచూశాడు. ఇప్పుడు యేమనుకున్నా ప్రయోజనంలేదు. ఈ ఆలోచనలతోనే ప్రొద్దు గడిచిపోతోంది.

ఆనాడు కోర్టుపని యెక్కువగానేవుంది. మిగతావ్యవహారాలు బాధిస్తున్నాయి. మనస్సెటోపోయింది. ఇవ్వాళ యేదైనా సినిమాకువెళితే బాగుండునని అనుకున్నాడు. కొత్తగా ఇంగ్లీషుపిక్చరొకటి వచ్చింది. పెద్ద రష్‌వుండదు అనుకుని బయలుదేరాడు.

హాలుదగ్గరకువెళ్లటమే లేటుగావెళ్లాడు. నడుస్తూవెళుతున్న చంద్రానికి అడుగడుక్కూ ఆలోచనలే! ఆదరాబాదరాగా బుకింగ్ఆఫీసుకువెళ్లి టిక్కెట్టుతీసుకున్నాడు. ఇప్పుడే న్యూస్‌రీల్ ప్రారంభమయింది అన్నాడు అతను. చకచక లోపలికివెళ్లాడు.

హాలంతా అంధకారంగావుంది. ఎక్కడికివెళ్ళి కూర్చోవాలో అర్థంకావటంలేదు. ఇంతలోకి హాలుమనిషి బ్యాటరీలైటుతీసుకునివచ్చి దారిచూపిస్తున్నాడు. ఆ వెలుతురు ఆసరా చేసుకుని వెళ్ళివెళ్ళి ఓ కుర్చీలోకూలబడ్డాడు. కాసేపు వెనకా ముందు చూశాడు. ఇంకా మనుష్యులు స్పష్టంగా కనబడటం లేదు. తెరమీదబొమ్మలుమాత్రం స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కుర్చీలోసర్దుకుని కూర్చుంటుండగా అతని ఎడంవైపు కుర్చీలో కూర్చున్నవ్యక్తి మగకాదు అని గ్రహించకలిగాడు. ఓసారి ఆమెవైపుకు చూసినట్లుచూసి మళ్ళీవత్తిగిలి కూర్చున్నాడు. ఆ అమ్మాయి కాస్తంతవదిగి కూర్చుంది.

న్యూస్‌రీల్ అవడంతోడనే ఎడ్వర్‌టైజ్‌మెంట్సు చూపిస్తున్నారు, సబ్బులు, నూనెలగురించి. విసుగుపుట్టిపోతోంది. అసలుపిక్చరు ఎప్పుడువస్తుందా అన్నట్టు అసహనంగా కూర్చున్నాడు. తెరదగ్గరగా వున్నవాళ్లు ఈలలు, కేకలు వేస్తూ తమ అయిష్టతను బాహాటంగానే చాటుతున్నారు.

హాలునిండా ఎలక్ట్రిక్ ఫాన్సు గిరురునతిరిగిపోతున్నాయి. చిరుచలికూడా వేస్తున్నట్టుంది. జనం కొంచెంబిగ్గరగానే మాట్లాడుకుంటున్నారు. సరిగ్గా పిక్చరు మొదలు పెట్టేవేళకి హాలంతా నిశ్శబ్దం అవరించుకుపోయింది. అందరూ చూసి ఆనందిస్తున్నారు. సముద్రతీరంలో విచ్చలవిడిగా ఆడది మగవాడు సంచరింటంచూస్తూ తబ్బిబ్బులైపోతున్నారు. హద్దులులేని డ్రస్సుతో ఆడా మగా భేదం లేకుండా స్క్రీన్

మీద ప్రేమకలాపాలుచేస్తుంటే, హాలు దద్దరిల్లిపోయేట్లు హర్షధ్వానాలు చేస్తున్నారు. మళ్లీ మరుక్షణంలో అంతా నిశ్శబ్దమే, తెరమీదజరుగుతున్న హావభావాలకు, ప్రేక్షకులు ప్రతిధ్వనిస్తున్నారు.

చంద్రం ఒకటిరెండుసార్లు సర్దుకున్నట్టు కూర్చుంటూ ముందుకు ఒరిగేటప్పటికి తనముక్కు ముందు కుర్చీకితగిలి ఆకుర్చీలోకూర్చున్నఅమ్మాయికి చైతన్యంకలిగించింది. విసురున వెనక్కుతిరిగిచూసేటప్పటికి చంద్రంకళ్లు అట్లాగేనిలిచిపోయినాయి. ఆ అమ్మాయి ఎవరోకాదు కమలే !

"మీరా!" అంటూ కొంచెంనెమ్మదిగాను, ప్రక్కన వున్న రెండుమూడుకుర్చీలవాళ్ళకు వినిపించేటట్లూనూ అన్నది కమల. ఇంకా నలుగురైదుగురు చంద్రంవైపునే చూసి మళ్లీ కళ్లుమార్చుకున్నారు. అతనిఎడం పక్కనవున్న అమ్మాయి విడ్డూరంగా చంద్రంవైపుచూసి మళ్లీ అటువైపుకే మొగ్గింది. చంద్రం తనకు ఎదురుగావున్న ముందువరసలో కూర్చున్న వాళ్లు అయిదారుగురు ఆడవాళ్లేవున్నారు. కమల బహుశా తనస్నేహితురాళ్లతో సినిమాకువచ్చివుంటుం దనుకున్నాడు. ఒకటిరెండుసార్లు కమలయితే వెనక్కుతిరిగిచూసింది. చంద్రం చూసికూడా నిర్భావంగా ఊరుకున్నాడు. అంతమంది ఆడ వాళ్ళమధ్య, కమల తనతోమాట్లాడటం అతని కేమాత్రం యిష్టంలేదు. భయపడిపోయాడు. ఎట్లాగైనా తాను అక్కడి నుంచి లేచి ఇంకోచోటు వెదకటమే శ్రేయస్కరం అను

కున్నాడు. అయితే హాలంతా నిండిపోయింది. ఎక్కడా చోటుకనబడటంలేదు. అక్కడినుంచి లేచి వెళ్ళేస్థితిలో లేక పోయినతర్వాత కనీసం అసలు హాలులోనుంచైనా వెళ్లి పోవాలి అనుకున్నాడు. మధ్యలోకనక వెళ్లితే మళ్ళీ కమల వచ్చి ఏవేమి ప్రశ్నలువేస్తుందో అదొకతంటా అనుకుంటు న్నాడు. ఉన్న మానసికఆందోళనకు ఏదోకొంత శాంతి లభి స్తుందనే సదుద్దేశంతో చంద్రం సినిమాకువస్తే సమస్య మళ్ళీ ఎదురయిండి. ఏమయినాగాని ఇంటర్వల్‌లో ఇంటికివెళ్ళి పోతేనే మంచిదని నిశ్చయంచేసుకున్నాడు. ఆ క్షణాన అక్కడినుంచి వెళ్ళిపోదామనుకున్నా ఇరకాటంగానేవుంది. అందరికీ అడ్డంవచ్చానని విసుక్కుంటారు అని భయపడుతూ మెదలకుండావూరుకున్నాడు. వెనక్కు రెండుచేతులు బార జాపి, దర్జాగాకూర్చున్నాడు. తనఎడంచెయ్యి, ప్రక్కకుర్చీ మీదకు వెళ్ళటంచేత, ఆయువతి కొంచెంముందుకుజరిగి, చెక్కిళ్ళమీద చెయ్యిపెట్టుకుని కూర్చుంది. చంద్రానికి కూర్చోటం కుదర్లేదు. ఎట్లాకూర్చున్నా ఏదోతంటా వస్తూనే వుంది. ఆసనంనిండా ఏమున్నాయోఏమో సూదుల్లాగ పొడుస్తూనేవున్నాయి. మొత్తంమీద చాలా ఇరకాటంలో పడిపోయి, ఈ సినిమాకు ఎందుకువచ్చామురా అన్నట్టు అయిపోయింది. మెల్లిగా వదిగి కుర్చీలో సగంవెనకవైపుకు జరిగి కూర్చున్నాడు. ఈఫోజు బాగుంటుందేమోఅన్నట్టు. తనకళ్ళురెండూ వెనకవైపు మూడువరసలూ దూసుకుని పోయి నాలుగోవరసలో ఎడంవైపునుంచి రెండోకుర్చీలో

కూర్చున్న అఖిలమీదపడ్డాయి. చంద్రం గతుక్కుమన్నాడు. గుండె గుభేలుమన్నది, ఒళ్ళు జలదరించింది. మళ్ళీ అవునా కాదా అనిపరీక్షగాచూశాడు. 'అవును అఖిలే' అనుకున్నాడు. అయితేయేం! దూరంగానేవుంది చిక్కేమీలేదు లేఅని తనలో తాను సమాధానపడ్డాడు. ముందుచూడపోతే కమల, వెనక్కుచూస్తే అఖిల, మధ్యలోతాను. కాసేపు సినిమా చూస్తున్నాడు. కాసేపు వీళ్ళందర్నీ చూస్తున్నాడు.

మళ్ళీ ఆ లోచనలన్నీ వెంటపడ్డాయి. ఇంకా విశ్రాంతిఎక్కడిది! తాను కోరుకున్న మనశ్శాంతి ఎక్కడ దొరుకుతుంది! అసలు యివ్వాళ సినిమాకువెళ్లాలని ఎందుకు బుద్ధిపుట్టిందో అనవసరంగా. ఎన్నడూలేనికోరిక. దానికి తగ్గట్టుగానే ఏవో మనస్సుకు చికాకుగల కారణాలు కనిపిస్తు న్నాయి. అనుకున్నాడు.

ఇంటర్ వెల్ అయింది. కొద్దిక్షణాల్లో తెరిపిస్తుంది. తెర తెల్లబడింది. హాలంతా వెలుగయిపోయింది. కమల వెనక్కు తిరిగి ఆశ్చర్యంగాచూస్తూ "మీయిద్దరూ వచ్చారన్నమాట సినిమాకు" అన్నది.

చంద్రం మొహంచిట్లించి ఎడంవైపుకు కళ్ళుపోని చ్చాడు అప్రయత్నంగానే. స్వర్ణ ముగ్ధలాగ కూర్చునివుంది. చంద్రంగుండె గుభేలుమంది. స్వర్ణ చిరునవ్వు మొహంపెట్టు కునికమలవంక చంద్రంవంకా చూసి తలవంచుకుంది. చాలా మంది లేచి బైటకువెళుతున్నారు.

చంద్రంఅయితే కళ్లూ, చెవులూ అప్పచెప్పి కూర్చు న్నాడు మాటాపలుకూ లేకుండా. అంతే. ఆసమయంలో ఏమిమాట్లాడాలో అర్థంకాలేదు. విస్మయంగాచూస్తున్నాడు.

"మీరెప్పుడొచ్చారు! నాకు కనిపించలేదే! మేము మొట్టమొదటగానే వచ్చాము!" అన్నది కమల.

ఎవరు సమాధానం చెప్పాలో తెలీక తికమకపడ్డారు యిద్దరూను.

"నేనూ మాస్నేహితురాలు వచ్చాం" అన్నది స్వర్ణ తనప్రక్కగాకూర్చున్న అమ్మాయిని పరిచయంచేస్తూ.

"నువ్వట్లాగే చెబుతావులే" అంటూ కమల నవ్వింది.

స్వర్ణకు నవ్వువచ్చింది. ఆపుకోవటానికి ప్రయత్నిం చింది. చంద్రానికి నిజంగానే కోపంవచ్చింది. ఏమీ చెయ్య లేక మెదలకుండా వుండిపోయాడు.

కమల రెండుకళ్లూతిప్పుతూ అటూఇటూ తేరిపార చూస్తోంది.

"అదుగో మా ఫాదర్." అంటూ చూపుడువేలుతో పై అంతస్థులోకి చూపిస్తోంది.

స్వర్ణ గభాలున వెనక్కుతిరగాలని ప్రయత్నంచేసి ఆగిపోయింది. చంద్రం త్రుళ్ళిపడ్డాడు. వెనక్కుతిరగలేదు. అట్లాగే నిబ్బరంగా వుండిపోయాడు. అసలు యివ్వాళ సినిమాకు ఎందుకువచ్చామా అని పశ్చాత్తాపపడుతున్నాడు చంద్రం.

ఉక్కిరిబిక్కిరయిపోతున్నాడు. ఇక ఇక్కడ ఒక్క క్షణం వుండటానికివీల్లేదు. ఎట్లాగైనా వెళ్ళి బైటపడదామనుకుంటు న్నాడు. ఇప్పుడు లేచివెళ్ళడంఅంటే అందరూ చూడటం జరుగుతుందనే భయంతో ఇంకా శరీరాన్ని ముడుచుకుని ఆకుర్చీలోనే కూలబడిపోయాడు. పిక్చర్ మొదలుపెట్టంగానే పలాయనం చిత్తగించాలనే ధ్యాసలో వుండిపోయాడు.

కమలవుతే స్వర్ణను, చంద్రాన్ని కలిపి ప్రశ్నలు వేస్తోంది. ఎవరు సమాధానంచెప్పాలో తెలీదు. ఎందుకు చెప్పాలో అంతకంటె అర్థంకావటంలేదు. అంతా ఆయోమయావస్థగా వుంది. అందులో చంద్రానికి ఆకాసేపు పిచ్చి ఎత్తినట్టు తన్నుకుపోతున్నాడు. ఒక్కనిముషం ఒక్క యుగం లాగ వుంది.

లైట్లు ఆరిపోయినాయి గప్పున. సినిమా మొదలయింది. ఇంకా వచ్చేవాళ్ళు వస్తూనేవున్నారు. సద్దుకుని కూర్చోవటంలేదు. ఇదేసమయం అనుకున్నాడు. మెల్లిగా లేచి బయలుదేరాడు. కమల తననుచూడకుండా ఏట్లాగయితేనేం జనాన్ని తప్పించుకుంటూ కుర్చీలవరసల సందుల్లోంచి మెల్లిగా నడుస్తూ బైటపడ్డాడు. మొహమంతా ముచ్చెమట్లు పోసినాయి. జేబురుమాలతో తుడుచుకున్నాడు. పెద్ద నిట్టూర్పువిడిచాడు ఎట్లాగయితేనేం బ్రతికి బయటపడ్డాములే అన్నట్లు.

వెన్నెల వెలుగుతోంది. చల్లదనం అంతా నిండివుంది. ఆ పౌర్ణమి వెలుగులో నిలబడి తలెత్తి చంద్రబింబంలోకి

చూస్తుంటే "ఎంత చల్లగావుంది! ఎంత హాయిగావుంది ప్రాణం! ఇలాంటి స్వాభావికసౌందర్యాన్ని మరిచిపోయి ఎదో మనశ్శాంతికలుగుతుందని కూపంలోకివెళ్ళి పడ్డాను" అనుకున్నాడు. "ఇప్పుడు సూటిగా ఇంటికివెళ్ళాలి" అనుకున్నాడు. రోడ్డుమీదనడుస్తూ చల్లగాలిపీలుస్తూ హాయిగా వెళుతున్నాడు. "ఇవ్వాళ ఆకలివేయటంలేదు. ఇప్పటి సంఘటనలతోనే కడుపునిండిపోయింది. అందుకనే తేలికగా రెండు చపాతీలుతిని, అరకప్పు పాలుతాగి చప్పగా పడుకుందా"మనుకుంటున్నాడు.

తీరా రూముకువెళ్లి జేబులుతడుముకుంటే ఏముంది! తాళంచెవి కనిపించటంలేదు. గాభరాపడిపోయాడు. ఒక్క క్షణం అట్లాగే నిలబడిపోయి ఆలోచించాడు. రెండుజేబులూ తడిమిచూశాడు. బహుశా అవి సినిమాహాలులోనే పోయివుంటాయి. సందేహంలేదు. ఇప్పుడేమిచెయ్యటం! సినిమా హాలులోకి ఎట్లావెళ్ళటం! తాళంవైపు దిగాలపడిచూస్తూ నిలబడిపోయాడు. అమాంతం తాళం పగలకొట్టేద్దా మనుకున్నాడు. అటుఇటు తత్తరబిత్తరగా చూశాడు. నిస్సహాయుడయి నిలబడిపోయాడు. మనస్సు ఆలోచించటం మానేసింది. స్తబ్ధుడయిపోయాడు.

రెండుక్షణాల్లోనే ఓ కారువచ్చి ఆగింది. మెల్లిగా లోపల్నుంచి రమణ దిగాడు.

"ఓ! నువ్వా రెడీగానేవున్నావు! ఎక్కడికి బయలుదేరావు! సినిమాకేనా!" అన్నాడు.

"ఆ!" అంటూ వెనక్కు తిరిగాడు యాంత్రికంగా చంద్రం.

"రా, వెళదాం రా" అంటూనే చంద్రచెయ్యి పట్టుకున్నాడు. రమణ వెంటే తానుకూడా నాలుగుఅడుగులు వేసి కారులోవచ్చి కూర్చున్నాడు.

రమణమాట్లాడుతోంది వినిపించుకోవటంలేదు. ఊరికే 'ఊ' మాత్రం కొడుతున్నాడు. అంతే! రయ్‌మని కారు తారురోడ్డుమీద పరుగెత్తుతోంది.

"ఏమిటి అట్లావున్నావు" అన్నాడు రమణ. దానికే సమాధానమూ లేదు. అతనికి ఆశ్చర్యం వేసింది. కారు గభాలున ఆగిపోయింది.

"ఎక్కడికొచ్చాం" అన్నాడు చంద్రం.

"ఏమిటట్లా గాభరాపడుతున్నావు!"

"ఇప్పుడు మనం ఎక్కడికొచ్చామండీ!"

"సినిమాహాలుకు!"

"సినిమాహాలుకా!"

"అవును. సినిమాకు వెళదామనుకున్నాంగా!"

"సినిమాకు వెళ్ళటమేమిటి!"

"ఏమిటయ్యా, నీకు మతేమన్నా పోయిందేమిటి! ఇదిగో నావంకచూడు! నేనెవరో గుర్తున్నానా! నిద్ర మత్తులో వున్నట్టుంది. వ్యవహారం!"

చంద్రం తలకాయపట్టుకుని కారులోపడ్డాడు.

"చంద్రం, చంద్రం" అని రెండుసార్లుపిలిచి తనూ విసుగుపుట్టి ఊరుకున్నాడు. భుజంగరావుగారు సినిమా హాలుకు కారును తీసుకురమ్మన్నాడు. అందుకనే రమణ కారులో వచ్చాడు. మధ్యలో చంద్రాన్నికలుసుకుని బాతా ఖానీకొట్టవచ్చు అనుకున్నాడు. కాని అతనిమూడ్ సరిగా లేదు.

ఇట్టే షో పూర్తిఅయింది.

"మిస్టర్ చంద్రం! నిద్రలేవయ్యా! ఓమూల భుజంగ రావుగారు వస్తుంటేను!" రమణ మేలుకొల్పాడు.

చంద్రం అదిరిపడి లేచికూర్చున్నాడు. కళ్లు నులుపు కుంటూ కారులోంచి బైటకుచూశాడు. జనంఅంతా హాలు లోంచి వచ్చేస్తున్నారు. తనకుపూర్తిగా స్పృహవచ్చింది. ఎవరికంటా పడకండా తాను హాలులోకివెళ్ళి కనబడని తాళంచెవికోసం వెదుకుదామని కాగుదిగాడు.

"ఎక్కడికి" అని రమణ ప్రశ్నవేశాడు. సమాధానం చెప్పకండానే ముందుకు రెండడుగులువేశాడు. మెట్లమీాద నుంచి భుజంగరావు వస్తున్నాడు. ఎడంవైపునుంచి అఖిల ఇంకెవరో వస్తున్నారు. స్వర్ణవుతే తన స్నేహితురాలితో దూరంగా కనిపించింది. కమల గబగబ పరుగెత్తుకుంటూ వచ్చింది చంద్రందగ్గరకు.

"ఇదిగో మీాతాళంచెవి. మీాసీటులోపడివుందట స్వర్ణ తీసి నాకుయిచ్చింది. అయినా మీారు మధ్యలో వెళ్ళి పోయారేమిటి?" కమల ప్రశ్నించింది.

రమణ ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయాడు.

"వాట్ మిస్టర్ చంద్రం! నువ్వూ ఈషోకే వచ్చావేమిటి!" అన్నాడు భుజంగరావు.

చంద్రం సమాధానం చెప్పటానికి తడబడ్డాడు.

రమణ దీర్ఘంగా చంద్రంవైపుకు ఓచూపుచూసి గిర్రునవచ్చి కారులోకూర్చున్నాడు.



# 11

తెల్లవారింది. స్వర్ణ యింట్లో లేదు. చంద్రంగది తాళం వేసివుంది. "ఇంకేముంది! ఇద్దరూకలిసి లేచిపోయారు" అన్నారు నలుగురూనూ.

అందరికంటె రమణ యెక్కువగా గాభరాపడు తున్నాడు. "ఇదేమిటి యీపనిచేశా" డని. తనకీవిషయం తెలీదని చెప్పుకోలేక సతమతమవుతున్నాడు. ఎంత చెప్పినా వాగేశ్వరి అవునన్నట్లు తలవూపుతోందేగాని రమణమాటలు నమ్ముతున్నట్లు కనబడలేదు. ఆయనకు మతిలో మతిలేదు. చెడ్డ మానసికవేదన పడుతున్నాడు. తనకు తెలియందే యింతసాహసం వీళ్లిద్దరూ చెయ్యగలరా అనే ప్రశ్న ఉదయించింది. 'ఎట్లాగయినా ఈ ఉపాయంపన్నితే గత్యంతరం లేక చివరకు తనకూతుర్నే చంద్రం పెళ్ళిచేసుకుంటాడని వేసినఎత్తు' అనివాగేశ్వరి దృఢవిశ్వాసం.

కమలకు అఖిలకుకూడా రమణంటే ద్వేషంకలిగింది. అందులో కమలకు కోపంకూడా వచ్చింది. 'మనింట్లోవుంటూ యిన్నాళ్ళబట్టి మనకేదో ఉపకారంచేస్తున్నట్టు నటిస్తూ యింతపనిచేస్తాడా' అనుకుంది. తానూ, చంద్రం కలిసి మాట్లాడుతున్నప్పుడుకూడా రమణ మొహం చిట్లిస్తూనే వున్నాడు. దీనికంతా యిది కామాలుకారణం అనుకుంది ఉక్రోషంపట్టలేక. ఏమీచెయ్యటానికీ తోచక, గదిలో బీరువాలో వున్న చంద్రంఫొటోను తీసి చించి పోగులుపెట్టింది. అప్పటికిగాని తనకసి తీరినట్లుకాలేదు. అఖిలకు బాధవున్నా

కమలంత తీవ్రంగా బాధపడటంలేదు. తనకు కమలమీద, స్వర్ణమీద ద్వేషం అసూయ కలిగినాయి. స్వర్ణ బాధతో తనకు తెలియని తృప్తి ఆనందాన్ని చూసుకుంది. స్వర్ణను చూసి అసూయపడేదానేకన్నా, యీవిధమైనశాంతే యెక్కువగా లభించింది.

రమణ మూగవాడయిపోయాడు. తాను నిర్దోషిఅని ప్రతివ్యక్తిదగ్గరకు వెళ్ళి చెప్పుకోవలసిన స్థితిగలిగింది. ఓమూల తనకూతురు తనతో చెప్పకుండా వెళ్ళిపోవటం ఓబాధ. చంద్రంతో వెళ్ళిపోయిందిగామాలు అని సంతోషపడటం లేదు. దానికి కారకుడు తనేఅని అందరూ అనుకోవటం అతనికి చాలా బాధగావుంది.

మెల్లిగా చేతులునలుపుకుంటూ భుజంగరావుదగ్గరకు వెళ్లినిలబడ్డాడు. రమణకు తెలుసు ఎన్ని చెప్పినా భుజంగరావు నమ్మడని. అలాంటప్పుడు ఏంచెప్పినా నిష్ప్రయోజనమే! తనమనస్సులో ఓఆలోచన మెరిసింది. చప్పున యింకో అంగ ముందుకు వేశాడు.

"ఈతప్పుకు నన్నుక్షమించండి స్వార్థబుద్ధితో మా అమ్మాయికి చంద్రంసంబంధం కావాలనే పట్టుదలతో యీ విధంగా చేశాను" అన్నాడు గంభీరంగా రమణ.

పెద్దపెట్టున నవ్వాడు భుజంగరావు.

"అవును. అందరూ అనుకుంటుంది యిదే కాని నీమనస్సు నాకు తెలుసు. భయపడవద్దు. నిజానిజాలు నిలకడ మీాద తెలుస్తాయి" అన్నాడు భుజంగరావు.

చప్పున తలెత్తాడు రమణ. అతనిఆవేదన చేత్తో తీశేసినట్లయింది.

"మాఅమ్మాయిచేస్తే ఒకటి, నేనుచేస్తే ఒకటీనా!" అన్నాడు రమణ.

"మీఅమ్మాయిఒకటీ మాఅమ్మాయిఒకటీనా" అన్నాడు తలవూపుతూ భుజంగరావు.

పెదిమలు తడబడ్డాయి. గొంతులో గీరవచ్చింది. చేతులురెండూ వణకిపోతున్నాయి. "భుజంగరావుగారూ" అంటూ సణుక్కుంటూ ఉత్తరీయంతో కళ్ళనుఅద్దుకున్నాడు. రెండుక్షణాలాగి "మీఆదరాభిమానాలకు నేను కృతజ్ఞుణ్ని" అన్నాడు.

"ఇది చంద్రానికి పుట్టినబుద్ధికూడా కాదు. దీంట్లో యేదో అంతరార్థం వుండివుంటుంది" అన్నాడు ఆలోచనగా భుజంగరావు.

"అంతేనంటారా!" ఆరాటంగా అన్నాడు రమణ.

అవునన్నట్లు ఆయన తలవూపాడు.

అప్పుడే ఊరంతాపాక్కిపోయింది. 'భుజంగరావుగారి జూనియర్ చంద్రం, ఆయనదగ్గరుంటున్న గుమాస్తా రమణ గారికూతుర్ని లేవదీసుకుని వెళ్లిపోయాడు' అని. ఈమాటలు యెంతో తలవంపులుగావున్నాయి. రమణ యెంతో బాధ పడుతూ కుమిలిపోతున్నాడు.

నలుగురూ నాలుగురకాలుగా అంటున్నారు. ఇద్దరూ కలిసి తెల్లవారుఝామున బండిలోపోతున్నట్లు చూసినవాళ్ళు చెపుతున్నారు.

రాత్రి పదిగంటలు దాటినతర్వాత ఎవరోవ్యక్తి చంద్రంరూముదగ్గర తిరిగుతున్నట్టుకూడా చూశారుట! క్షణంలో తాళంవేసి, యిద్దరూ స్టేషన్‌వైపుకు వెళ్ళిపోయారట. ఇదో కథనం.

ఎవరికితోచినట్లువాళ్లు కథలుఅల్లి స్వర్ణను, రమణను, చంద్రాన్ని చేతనయినంతచెడుగా చిత్రించటానికి ప్రయత్నం చేస్తున్నారు.

“అవునుమరి! పెళ్ళనేది వ్యక్తిగతమైనవిషయం. భుజంగరావు చంద్రాన్ని చేరదీశాడంటే దాంట్లో ఎంత అంతరార్థంవుంది! పెద్దమ్మాయినిచ్చి పెళ్ళిచేద్దామనుకున్నాడు. అది చంద్రాని కిష్టంలేదు. నిర్మోహమాటంగా ఆముక్క ఎట్లాచెపుతాడుకనక! అయినా పెళ్ళివిషయంలో భుజంగరావుగారు వత్తిడిచేయటంకూడా మంచిపనికాదు”. అని కొంతమంది మాట్లాడుకుంటున్నారు.

ఇప్పుడు రకరకాలచర్చలు బయలుదేరుతున్నాయి. మనస్సుల్లోదాగివున్న, దాచిపెట్టుకున్న భావపరంపరలు బహిర్గతమవుతున్నాయి.

భుజంగరావుకు యిదొక పెద్ద సమస్యగా పరిణమించింది.

తనకూతుళ్ళ వివాహంవిషయంలో ఆయన అనుకున్న దేమీ కొనసాగటంలేదు. రాజాను మనస్సులో పెట్టుకుంటే అట్లా అయిపోయింది. చంద్రం తనకు అల్లుడు కాకతప్పదని ధీమాతో వుంటే యీవిధంగా అయిపోయింది. ఈమధ్య కేసు కని బొంబాయి వెళ్ళివచ్చాడు. గుర్రపుపందాల్లో డబ్బు యెక్కువగానే పోగొట్టుకున్నాడు. అది యెవ్వరికీ తెలియ కండా గుంభనగానే వుంచడానికి ప్రయత్నం చేస్తున్నాడు. అయితే మనోవేదన రోజురోజుకు యెక్కువయిపోతోంది. తాను నమ్ముకున్నవ్యక్తులిద్దరూ తనకు ద్రోహంతలపెట్ట నున్నట్లు తెలుసుకున్నాడు. కాని దానిని నలుగురికీ తెలి యటం ఆయనకు యిష్టంలేదు.

జీవితంలో ధ్యేయమంటూ యేదీపెట్టుకోక, ఏసమ యానికి ఏదిచేతికిఅందుతే దాన్నే తనదాన్నిగా స్వీకరిస్తూ, పోయినదానికి అట్టే విచారించక, గమ్యస్థానం లేకండా వంకర టింకరగా ప్రయాణంసాగిస్తున్న భుజంగరావుకు యీ అనుభ వాలు పాఠాలునేర్పినట్లయినాయి. ఎంతో పశ్చాత్తాపపడు తున్నట్లు బాధపడుతున్నాడు. కాని కొన్ని మించిపోయి నాయి. వాటినిగురించే బాధ. ఏమయినా చాలా చిరాకుపడి పోతున్నాడు. చప్పునతనగదిలోకివెళ్ళి కుర్చీలోకూర్చున్నాడు. డ్రాయరులోంచి డైరీ తీసుకున్నాడు. వ్రాయటం మొదలు పెట్టాడు.

"ప్రతివానిజీవితంలోనూ లక్ష్యమంటూ ఒకటుండాలి. దాన్నిసాధించటానికి సాయశక్తులా ప్రయత్నించాలి. డబ్బు

సంపాదనకుగాని, పిల్లలచదువుకుగాని, పెళ్ళిళ్ళకుగాని, ఒక నిర్ణయమైనపద్ధతి అవలంబించాలి. లేకపోతే యెప్పుడు యేది దొరుకుతుందో దానిమీదే ఆధారపడుతూ ఏవిధమైన ప్రయత్నమూ ఆలోచనా లేకపోతే ఓనాటికి జీవితమంటే వెగటు పుడుతుంది. ఏమీ చెయ్యలేకపోయానే అనే అసంతృప్తి కలుగుతుంది. అసమర్థతవలన బాధ పెరుగుతుంది. చివరకు, యేప్రయోజనంలేని జీవితాన్ని సాగించటమే అవుతుంది.

చప్పున డ్రైరీమూసేసి వరండాలోకివచ్చాడు. పిల్లలు, భార్య సావిట్లో శిరిగ్గా కూర్చున్నారు, ఎవ్వరూ ఏమీ మాట్లాడటంలేదు.

అదివరకుమాదిరిగా రమణ ఇటువైపుకు రానేరావటం లేదు. "ఎందుకురావటంలేదు" అనైనా అనుకోలేదు. వాగేశ్వరి పిల్లలు అంతకంటే కోపంగావున్నారు. భుజంగరావు మనస్సు యెటూ నిర్ణయించలేకుండా వుంది.

రెండుమూడురోజు లయింది. వాళ్ళజాడ తెలియటంలేదు. రమణకు యెటూ తోచటంలేదు. కంగారుపడిపోతున్నాడు. చంద్రదంతండ్రిపేర టూకీగా ఉత్తరంవ్రాశాడు.

"...మీఅబ్బాయి యిక్కడికిరావటం అవసరం. కొన్ని ముఖ్యమైనకేసులు హియరింగ్‌కు వస్తున్నాయి. వాటిలో చంద్రం ఆర్గ్యూ చెయ్యాలసివస్తుంది. తప్పక వెంటనే రమ్మనమని చెప్పండి" అంటూ ఇంతకంటే యేమీ వ్రాయకూడదనుకున్నాడు. "దీంతో ఆయన తండ్రికిఅర్థమవుతుంది. ఓవేళ యింటికేవెళ్ళివుంటే, తప్పనిసరిగా యీ

ఉత్తరం చూచుకుని రావటమో సరియైనసమాధానం దొరకటమో జరుగుతుంది" అనుకున్నాడు.

ఆందోళనపడుతున్నాడు. తనకూతురుతన కళ్ళయెదుట లేకుండా వెళ్లిపోయింది. అందులోనూ చెప్పకుండా అనే ఆవేదనవుంది. ఒకప్పుడు యింకోరకపు ఆలోచనవచ్చి భయపడి పోతూవుంటాడు.

ఆనాడు రమణే భుజంగరావుగారికింటివచ్చి వరండాలో నిలబడ్డాడు. అఖిల చూసికూడా మాట్లాడించలేదు. "సరే, కాని" అనుకుంటూ తానే చొరవచేసుకుని లోపలికి వెళ్లాడు. భుజంగరావు కుర్చీలోచేరగిలపడి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. రమణరావటం అలికిడిచూసి తలపైకెత్తి కూర్చోమని సంజ్ఞచేశాడు. వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడన్నమాటేగాని, నోటమాటలేదు. కాసేపు యిద్దరూ మౌనంగానే వుండిపోయారు.

చప్పున పోస్టుమాన్ వచ్చి నాలుగు కవర్లు రమణ చేతికి అందిచ్చాడు. వాటిని పూర్తిగా చూడక మునుపే టేబుల్ మీద పెట్టేశాడు. ఆయన ముందుకువంగి చూచాడు. కనుబొమ్మలు ముడిపడ్డాయి. ఇట్టే కళ్ళు పెద్దవి చేసుకుని దాంట్లో ఓ కవరు చేతిలోకి తీసుకున్నాడు. రమణకుకూడా ఆశ్చర్యము, ఆరాటము యెక్కువయింది. ఆయన కవరును చించి లోపలకాగితాన్ని రెండుచేతుల్లోనూ పట్టుకుని మొదట నుంచి చివ్వరదాకా చదివేశాడు. ఆ కాగితాన్ని కాస్తా క్రిందకుదింపి రమణ మొహంలోకి వింతగా చుస్తూ దాన్ని

రమణ చేతికి అందిచ్చాడు. అతను చప్పున తీసుకున్నాడు. గబగబ ఆవేశంగా చూస్తున్నాడు.

ఇంతకీ ఆ ఉత్తరం చంద్రం దగ్గరనుంచి వచ్చింది.

తన తండ్రికి ప్రమాదమైన సుస్తీ చేసినట్లు, ఆ రాత్రి తనవూరుమనిషి వచ్చి చెప్పటం వలన తెల్లవారుఝామున బండికే వెళ్ళిపోయాడుట. ఇంకా స్పృహ లేకండానే పడివున్నాడని, డాక్టర్లు ధైర్యంచెపుతున్నా తనకుమాత్రం నమ్మకంలేకండా వుందని వ్రాశాడు.

నిలువునా నీరయిపోయాడు రమణ. కళ్ళు రెండూ అప్పచెప్పి కదలికలేకండా అట్లాగే చూస్తూ వుండిపోయాడు. తన కూతురి ప్రస్తావనే దాంట్లో లేదు. స్వర్గ మెక్కడికి వెళ్ళినట్లు! చంద్రం ఒంటరిగానే తనింటికి వెళ్ళాడా? రమణ ఒళ్ళు కాగిపోతోంది. విలవిలలాడిపోతున్నాడు. ఏమి చెయ్యాటానికి అర్థం కావటంలేదు.

ఏదో అభ్యర్థిస్తున్నట్లు భుజంగరావుకళ్ళల్లోకి జాలిగా చూస్తున్నాడు. ఆయనకూ యేమీ అర్థం కాలేదు. ఏ విధంగా రమణను ఓదార్చడంచాలో తెలీడంలేదు. నోటమాట రాలేదు. నిబ్బరతై పోయారు, ఇద్దరున్నా. అక్కడ ఒక్క క్షణంకూడా ఉండలేకపోయాడు. ఆ ఉత్తరాన్ని పట్టుకుని వణుకుతున్న కాళ్ళతో చప్పున లోపలికి వెళ్ళాడు "అక్కగారూ" అని గద్గదికంగా అంటూ.

వాగేశ్వరి ఆ ఉత్తరం చదువుతుంటే, ఆదుర్దాగా అఖిల, కమల తలొక వైపుకు చేరి ఎగిరెగిరి ఉత్తరంలోకి చూస్తున్నారు.

"అమ్మాయి ఎక్కడికి వెళ్ళినట్టు?" సణిగాడు మెల్లగా.

మొట్టమొదటి క్షణంలో వాగేశ్వరికూడా భయపడినా మరుక్షణంలోనే యింకో ఆలోచన వచ్చింది. చంద్రం స్వర్ణను తీసుకువెళ్ళలేదని ఈ ఉత్తరంలో యేమీ స్ఫురించటం లేదని అనుకుంది.

"అమ్మాయి స్వర్ణ మీతో యేమన్నా చెప్పిందా అమ్మా!" అంటూ అడిగాడు అఖిలవైపు కమలవైపు చూస్తూ.

"మాతో ఏమీ చెప్పలేదండీ!" ఇద్దరూ గాబరాగా అనేశారు.

ఇప్పటికవుతే చంద్రంజాడ తెలిసింది. స్వర్ణజాడే తెలియాలి. రమణ దిగులుతో క్రుంగిపోతున్నాడు. "అమ్మాయి ఎక్కడకి వెళ్ళినట్టు!" అని తపన పడిపోతున్నాడు. ఎరిగున్న వాళ్ళకు చెప్పి వాకబు చేయమన్నాడు. కొంతమందికి ఉత్తరాలు వ్రాశాడు. అయితే తానుమాత్రం కదల్లేక యింట్లోనే పడివున్నాడు.

ఒక్కరోజు గడవటమే మహాకష్టంగావుంది. మరుసటి రోజు మధ్యాహ్నం పన్నెండు గంటలవుతుంది. రమణ బరువుగా భుజంగరావు యింటికి వచ్చి ఆయన సలహా తీసుకుని

తానుకూడా యిక ఊళ్ళువెంట బయలుదేరాలని అనుకున్నాడు.

"ఏఊరని వెళతారు! ఎక్కడని వెదుకుతారు!" అంటున్నాడు భుజంగరావు.

"మా అబ్బాయి మిలిటరీలోకి వెళ్ళినప్పుడుకూడా రామనాథంగారింటికి వెళ్ళాడు. ముందర ఆ ఊరు వెళ్ళి విషయం తెలుసుకుని అక్కడిడుండి ఎటు వెళ్ళాలో ఆలోచించుకోవాలి." అన్నాడు బరువైన హృదయంతో.

ఆయనకూడా ఏమీ మాట్లాడలేకపోయాడు. ఇంట్లో వాళ్ళందరూ జాలిగానూ, ఆప్యాయంగానూ రమణవంక చూస్తున్నారు.

రమణ ఒక్కసారిగా అందరి మొహాల్లోకి చూసి వెనక్కు తిరిగాడు. ఒక అడుగు వీధివైపుకు వేశాడో లేదో "నాన్నా" అంటూ పరుగెత్తుకుంటూ స్వర్ణ వచ్చిపడింది.

నిర్ఘాంత పోయాడు రమణ. అఖిల, కమలాకూడా ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయారు. స్వర్ణ బిత్తరపోయినది. "ఎందుకు యింతవింతగా చూస్తున్నారు?" అనిఆశ్చర్యపోయింది.

నళిని నన్ను బలవంతంచేసి తీసుకెళ్ళింది. వెళ్ళక తప్పిందికాదు. వాళ్ళన్నయ్య పెళ్ళికి నన్ను రమ్మనమని ఎన్నాళ్ళబట్టో చెపుతూనేవుంది. మీతో చెప్పకుండా వెళ్ళినందుకు క్షమించండి. వెళ్ళంగానే మీకు ఉత్తరంకూడా

వ్రాశాను.” అలసటగా చెప్పుతూ అందరి మొహాల్లోకిచూసి యింకాముందుకు సాగలేకపోయింది.

“నువ్వెక్కడికి వెళ్ళావో తెలీక మేమంతా హడలి పోయాము...” అన్నది వాగేశ్వరి, నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ.

అప్పటికిగాని తాను వెళ్ళటాన్ని గురించి పడ్డబాధ ఆమెకు అర్థంకాలేదు. “అవును నిజమే. పెద్దతప్పేచేశాను. అని చాలా విచారపడుతోంది. కూతురు అంటున్నమాటలు వింటున్నాడేకాని, రమణనోటి వెంట మాటరాలేదు.

“నాన్నా” అని పిలించింది దగ్గరకు వెళ్ళి స్వర్ణ.

ఆప్యాయంగా యెంతో ప్రేమతో, కళ్ళల్లో కళ్ళుపెట్టుకుని కూతురిమొహంలోకి ఏదో కోరుతున్నట్లుచూశాడు. ఆమె విలవిలలాడిపోయింది. ఇంత మొహంచేసుకుని తండ్రి కళ్ళల్లోకి క్షమించమన్నట్లు ప్రాధేయపడుతూ చూస్తోంది.

చప్పున పోస్ట్‌మన్‌వచ్చి “రమణగారు యిక్కడే వున్నారే”అంటూ కవరుఅందించాడు. దానినిండా ముద్రలే! ఎక్కడెక్కడ తిరిగివచ్చిందో యేమో! కవరుచూస్తూ “ఇది నేరాసిందేనాన్నా!”— అంటూ స్వర్ణ చప్పున కవరుచించి కాగితాన్ని బైటకుతీసింది.

ఒకరిమొహంఒకరు చూసుకుని అందరూకూడా స్తబ్దులైపోయారు.

# 12

ఈసారి చంద్రం యిక్కడికి వచ్చేటప్పుడు ఖాళీగా రాలేదు. అనుభవాలమూట నెత్తినపెట్టుకువచ్చాడు. ఆదర్శాలసంచీ ఖాళీఅయిపోయింది. తనకుతానుగా ఆలోచించుకునేశక్తి సన్నగిలిపోయినట్టయింది. తండ్రి మంచంలో వున్నన్నాళ్ళు తాను తపనపడిపోయాడు. తండ్రికి తానేదో ఘోరమైన ద్రోహంచేసినట్టు బాధపడ్డాడు. ఆయనకసలు ఆ గవర్నమెంటుఉద్యోగం రాజీనామాచేయటం యిష్టంలేదు. దాంట్లోనే అంటిపెట్టుకుంటే ఏనాటికో దైవంకరుణిస్తాడని ఆయననమ్మకం. అంతేగాక తనకళ్ళయెదుట పడివుంటాడని సంతృప్తి. చిన్నప్పుడే అబ్బాయి గ్రాడ్యుయేట్ అవటం, ఎక్కువ ప్రయత్నంలేకుండా ఉద్యోగందొరకటం అదృష్టం అనుకున్నాడు. పైగా ఏదో మంచిసంబంధం చూసి చేస్తే తనబ్బాయికూడా ఓయింటివాడుఅవుతే చక్కగావుంటుందని ఎంతో ఆశపడ్డాడు. అయితే చంద్రం యిట్టే రాజీనామాచేసి మేనమామ అన్నముక్కలో పెద్దతప్పునుకనిపెట్టి ఏదోచేద్దామని, యేదోసాధిద్దామని అనుకున్నాడు. అయితే అలాంటివేమీ సాగలేదు. పెళ్ళివిషయంలో తనకువ్యతిరేకంగా అయిపోబోతోంది. ఇక ఉద్యోగంవిషయం అంతే, ఈ వకీలువృత్తికి మొదలూలేదూ చివరాలేదు. ఎప్పటికప్పుడే మొదలు! దేనికదే కొత్త! గడించిన అనుభవంమీద విజ్ఞానం మీదా కేవలం ఆధారపడాలంటే లాభంలేదు. రోజురోజుకు

కొత్తకొత్తశాసనాలు కొత్తకొత్త చట్టాలు, వీటన్నింటిని ఆకళింపుచేసుకుంటూ, ముందుకు సాగిపోతూవుండాలి.

ఇవన్నీ తండ్రిమంచందగ్గర కూర్చున్నప్పుడు స్ఫురణకువచ్చి విలవిలలాడిపోయాడు. అందులో తల్లి మరీ నిరుత్సాహపరిచేసింది. "నేచెపితే విన్నావట్రా నాయనా" అంటూ. దాంతో చంద్రం మరింత క్రుంగిపోయాడు. చివరకు తల్లి తండ్రులను సంతోషపెట్టలేకపోయానే అని చాలా బాధపడ్డాడు. "తండ్రి యీజబ్బునుంచి కోలుకుంటాడా! కోలుకోకపోతే శాశ్వతంగా నా జీవితంవున్నంతవరకు యేదో అపరాధంచేసినవాడిలాగా బాధపడాల్సిందే" అంటూ తల్లడిల్లిపోయాడు. తండ్రి తెప్పరిల్లాడు, రమణఉత్తరంచూసుకుని కాస్త ప్రాణంపోసుకున్నాడు ఉద్యోగంలో మళ్ళీ కొత్త ఆశలు రేకెత్తినాయి. "కేసుగురించి విచారపడటమెందుకు! వకీలువృత్తిలోనైనా శక్తిసామర్థ్యాలు చూపించచ్చు" అని మళ్ళీ ధైర్యంతెచ్చుకున్నాడు. ఇట్లా ఒడుదుడుకులుగా అతని భావనలు వూగిసలాడుతూవున్నాయి.

తీరా తండ్రికి కుదటబడ్డతర్వాత ఇక ప్రయాణమయ్యేసమయాన చంద్రం నీరసపడిపోయి "మీరెట్లాచెపితే అట్లాచేస్తాను ఇక మీరుచెప్పినదానికి ఎదురుచెప్పను" అని ఉద్వేగంగాఅన్నాడు.

దాంతో తండ్రి బుజ్జగిస్తూ మాట్లాడాడు. "నువ్వు మాకు వ్యతిరేకంగా ఏంచేశావనినాయనా! మేము యేం చెప్పినా నీబాగుకోసమే. అంతకంటె యేంలేదు. వకీలు

వృత్తిలో పేరుసంపాదించుకుంటున్నావు. సంతోషమైన విష యమే. దేంట్లోనైనా శ్రద్ధపెడితే మనశ్రమకు ఫలితంరాకుండా పోదు" అంటూ ధైర్యంచెప్పాడు. తల్లి అంతకంటేయెక్కువ స్వేచ్ఛయిచ్చినట్లు మాట్లాడింది. "నువ్వుకూడా ఓయింటి వాడివయితేచూసి సంతోషించాలని అనుకున్నాము. అంత కంటే మాకుమాత్రం యేముంది? పరాయిచోటుకివెళ్ళి బుద్ధి మంతుడివి అనిపించుకున్నావు. ఇక నీయిష్టం. ఏ సంబధమైనా సాంప్రదాయంకలదిచూసి ఒప్పుకుంటే మేముమాత్రం కాదం టామానాయనా!" అని.

వీళ్ళిద్దరి మాటలే చంద్రంచెవుల్లో గింగురుమంటు న్నాయి. "అబ్బ. అమ్మా, నాన్నా ఎంతమంచివాళ్ళు" అనుకున్నాడు. వచ్చికూర్చున్నాడు. ఇక భుజంగరావుగా రింటికివెళ్ళాలి. ఈమాట తలుచుకునేటప్పటికి యింటి విషయాలన్నీ యిట్టే మరచిపోయాడు. మళ్లీ యిక్కడి వ్యవహారాలన్నీ కళ్ళకుకట్టినట్లు కనబడుతున్నాయి. బుర్ర గిర్రున తిరగిపోయింది. ఇవ్వాళ్టికి పూర్తిగా రెస్టుతీసుకుని, వీలునుబట్టి సాయంత్రంవెళదాంలే అనుకున్నాడు. చప్పున రమణ ఉత్తరంమాట స్ఫురణకువచ్చింది. అయినా బద్ధకించి అట్లాగే మత్తుగా పడుకున్నాడు.

జీవితాన్నిగురించిన నిర్వచనాలు వింతవింతగా వస్తు న్నాయి. భవిష్యత్తునుగురించిన ఆలోచనలు తేలిపోతు న్నాయి. ఉద్యోగసమస్య తీరిపోయింది. ఇక వివాహసమ స్యొకటి వుంది. అది అత్యంతముఖ్యమైనది.

రమణ కుమార్తె స్వర్ణకళ్ళల్లో మెసులుతోంది. క్షణంలో కమలవచ్చి కోరచూపుతో తనను ఏదో బెదిరిస్తు న్నట్లు కనబడుతోంది. ఇట్టే అఖిలవచ్చి మూతిముడుచుకుని కూర్చుంటుంది. కళ్ళుమూసుకుంటూ తెరుచుకుంటూ ఈ ముగ్గురి వింత ప్రకృతులను విమర్శగా అవలోకిస్తున్నాడు.

ఆనాడు రమణవచ్చి పెళ్ళివిషయం ప్రస్తావన తెచ్చి నప్పుడు చంద్రం ఏమీ సుముఖంగా సమాధానం యివ్వలేక పోయాడు. అప్పటిపరిస్థితులు వేరు. ఇప్పటిస్థితిగతులు వేరు. ఎంతో మార్పువచ్చింది. తాను ఊహించలేనిమార్పు వచ్చింది. తనకు చేతకానిమార్పు వచ్చింది. తనశక్తికి అతీత మైనమార్పు వచ్చింది. ఇప్పటిపరిస్థితుల్లో తానెట్లా ప్రవర్తిం చాలో ఆలోచించుకుంటున్నాడు. కళ్లుమూసుకున్నా, నిద్ర రావటంలేదు. ఈరూపాలేవచ్చి తన ఆలోచనలను తీక్షణ పరుస్తున్నాయి.

ఎట్లాపసికట్టాడోయేమో రమణ వెతుక్కుంటూ వచ్చి నట్టు వచ్చాడు చంద్రంగది దగ్గరకు. తలుపుతట్టాడు చివా లున గభాలునలేచి తలుపు తెరిచాడు. ఎదురుగా రమణ ప్రత్యక్షం. అదిరిపడ్డట్లయింది. కళ్ళువిదిలించేసి "మీరా... రండిలోపలికి" అంటూ తడబడ్డాడు చంద్రం.

నెమ్మదిగా వచ్చికూర్చున్నాడు. కుశలప్రశ్న లయి పోయినాయి. చంద్రమవుతే తండ్రిసుస్థీవిషయం వగైరా లన్నీ వివరాలుచెప్పేశాడు. అన్నీ వింటూ కూర్చున్నాడు. అయితే ఆయనమానంలో భరించలేనిబాధ కనిపించింది.

వెళ్ళంగానే గదిలో అద్దంముందు నిలబడి పాపిడిసరిచేసుకుంటున్న కమలకనబడింగానే ఒళ్ళు ఝల్లుమన్నది. కమల యిట్టే వెనక్కుతిరిగిచూసి కళ్ళురెండూ ఓంతగా నిలిపేసింది. సావిట్లోంచివస్తున్న నాగేశ్వరి చంద్రాన్నిచూసి కళ్ళురెండూ పెద్దవిచేసి దవడలు రెండూ పైకీ కిందకీ కదలించటం మొదలుపెట్టింది గుటకలువేసుకుంటూ. భుజంగరావుగారి గదిలోకి వెళ్లాడు. గది ఖాళీగావున్నట్లుకనిపించింది. నాలుగు వైపులా చూశాడు. అలమారదగ్గర కుర్చీలోకూర్చుని ఏదో పుస్తకాన్ని పట్టుకుని తీవ్రమైన ధ్యానంలో వున్నట్లుగా కూర్చునివుంది అఖిల. చంద్రంకళ్ళు రెండూ అటువైపుకు వెళ్ళి మళ్లీ తిరిగివచ్చేద్దామని ప్రయత్నంచేస్తున్నాయి. అఖిల అలికిడి వినిపెట్టినట్లుంది. మెల్లిగా పుస్తకం చేతిలోనే పట్టుకుని లేచినిలబడి అశ్రద్ధగానూ, నిర్లక్ష్యంగానూ గది గుమ్మంవైపుకు చూసింది. కళ్లు తికమకపడ్డాయి. చంద్రం కనిపించేటప్పటికి గుండెగుభేలుమన్నది. "ఆఁ" అంటూ అమాంతం పుస్తకాన్ని చేతిలోంచి జారవిడిచింది. చంద్రం ఉలిక్కిపడ్డాడు. గభాలున వెనక్కు పరుగెత్తుదామనిపించింది. ఆమెమొహం అంత రౌద్రంగానూ, ఆశ్చర్యంగానూ వుంది. వెనక్కుతిరిగిగాడో లేదో భుజంగరావు అప్పుడే గుర్రబ్బండి దిగుతున్నట్లు చూశాడు.

ఆయన చేతికర్ర వూగించుకుంటూ ఎడంచేత్తో మీసాలు సవరించుకుంటూ ధీమాగానూ దర్జాగానూ వస్తున్నాడు. చంద్రం యింతయిపోయి గుమ్మంముందుకు నక్కి

నక్క నిలబడ్డాడు. భుజంగరావు పెద్దపెద్ద అంగలేసుకుంటూ తనగదిదగ్గరకు రాగానే చంద్రం కనిపించాడు. గతుక్కు మన్నాడు. ఆయనలో అంతమార్పురావటానికి కారణం యేమిటో అర్థంగాలేదు. మళ్ళీ తనేతమాయించుకుని, తాను యీవిధంగా భయపడటం ఆత్మవంచనే అనుకుని ధీమాగా తలపైకెత్తి కనుబొమలు పైకి క్రిందకు కదిలిస్తూ "ఎప్పుడొచ్చావ్'' అంటూనే లోపలికెళ్ళిపోయాడు.

"ఇవ్వాళే'' అని సమాధానంచెప్పుకుంటూ చంద్రం కూడా లోపలికివెళ్ళి ఆయనకు ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. అఖిల పమిటకొంగును, ఒళ్ళంతా బిగువుగాకప్పుకుని బెరుకుగా తలవంచేసుకుని గదిలోంచి చకచక వెళ్ళిపోయింది.

భుజంగరావు కోటువిప్పి ఒంకెకుతగిలిస్తూ యిదంతా ఓకంట కనిపెడుతూనేవున్నాడు. కుర్చీలోకూర్చుని యిద్దరూ యిష్టాగోష్ఠి అవీయివీ మాట్లాడుకున్నారు చాలాసేపటివరకు. చంద్రం ఆయనతో యింతసేపు తాపీగాకూర్చుని మాట్లాడటం యిదేప్రథమం. ఇంటిలోవాళ్ళుకూడా ఆశ్చర్యపోయారు. ఒకటిరెండుసార్లు రమణ గుమ్మందాకావచ్చేసి మళ్ళా వెనక్కుతగ్గాడు. ఈమాటలసందున మనకెందుకన్నట్లు!

ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లు భుజంగరావు గుమ్మంవైపు అస్తమానం పరికిస్తున్నాడు. ఇంతలోకి రమణ రానే

వచ్చాడు. ముగ్గురుకూడా కబుర్లుచెప్పుకోవటం మొదలు పెట్టారు.

"అనుమానం ఓచోట, సామ్మోమ్చోట" అన్నాడు రమణ. చంద్రంవైపుచూస్తూ నవ్వాడు.

అతనుకూడా నవ్వాడు. అర్థంకాక "ఏమిటిదీనిభావం" అనుకున్నాడు. ఏమీ తట్టలేదు. మాట్లాడకుండా వూరుకున్నాడు. భుజంగరావుమాత్రం అవునన్నట్లు తలూపాడు. అప్పటికీ యేమీ బోధపడలేదు.

"నువ్వు! వెళ్ళిపోవటాన్నిగురించి అక్కడిప్రజలు అనేకరకాలుగా అనుకున్నార్లే" అన్నాడు రమణ.

"చెప్పకండా హఠాత్తుగా వెళ్ళినందుకా?"

"ఊఁ..."

చంద్రం నవ్వుకున్నాడు. "ఈ వృత్తికి తట్టులేక పారిపోయాడని అనుకునివుంటార్లే" అనుకున్నాడు.

"ఎవరేమనుకుంటేయేముందిగాని మీరవుతే అనుకోలేదుగా!" ఎదురుగాచూశాడు రమణకళ్ళల్లోకి.

"నేననుకోలేదు" గంభీరంగా అనేశాడు భుజంగరావు! ముగ్గురూకలిసి నవ్వుకున్నారు.

రెండుమూడురోజులయింది. మామూలుగానే పనులన్నీ జరిగిపోతున్నాయి. కాని భుజంగరావుగారింట్లో మనుషులు

కొత్తగానూ వింతగానూ ప్రవర్తిస్తున్నందుకు అర్థంకాక సతమతమవుతున్నాడు చంద్రం.

కమలవుతే ఉద్యుక్తురాలయింది చంద్రందగ్గరకు వెళ్లి ఏవేవో చెపుదామని. కాని ఈసారి చంద్రాన్ని చూసినప్పటి నుంచీ చనువుకంటే సిగ్గెక్కువయింది. ఇట్టే బిడియపడుతుంది. అతను దూరానకనిపించినాచాలు. వళ్ళు ఝల్లుమంటోంది. తనమనస్సులో ఏదో భావన తనకు తెలియకుండా ప్రవేశించి నట్లయింది. అతన్ని చూస్తేచాలు మెలికలు తిరిగిపోతుంది. చంద్రంకూడా అంతకంటే బెట్టుగానేవున్నాడు.

ఆనాడు కోర్టునుంచి వస్తుంటే ఓ స్నేహితుడు చంద్రాన్ని పిలిచాడు. "నువ్వు బలేవాడివోయ్" అంటూ భుజంతట్టాడు.

ఏమిటన్నట్టు చూశాడు.

అతను జరిగినకథంతా చెప్పేశాడు. స్వర్ణకూ తనకూ యేదో సంబంధంకలిపి యిద్దరినీ చెడుగా ప్రచారంచేసిన సంగతి చెప్పేశాడు. తలవంపులయినట్లయింది. ఎంతో సిగ్గు పడ్డాడు. ఎవరు యీవిధంగా ప్రచారం చేసిందని అడిగాడు చంద్రం ఉద్రేకంగా.

ఎవరుచేశారో తెలీదుగాని మొత్తంమీద ఈ విధంగా బాడ్‌ప్రాపగాండా జరిపోయింది. పాపం రమణగారిమీద కూడా అనుమానం. ఆయనే ఈ పని చేయించాడనికూడా యింకో ప్రచారం..."

తలవ్రూపాడు ఆలోచనగా. అప్పటికే అన్నీ అర్థమయి నాయి. అఖిల, కమల, స్వర్ణ తననుచూసినప్పుడు ఆవిధంగా వుండటానికి కారణమయిదా అనుకున్నాడు.

ఈ ప్రచారంమాటవినగానే రమణమీద, స్వర్ణమీద ఓవిధమైన ఏవగింపుకలిగింది. ఇహ వాళ్ళమీద కోపంకూడా వచ్చేసింది. మనస్సు విరక్తిచెందింది. తామసంకూడా వచ్చింది. పళ్ళు పటపటమనిపిస్తూ రూముకువచ్చేశాడు.

రూముతలుపు గభాలునతీశాడు. లోపల ప్రవేశించాడు. చిరాకుగా బూటుపిప్పేసి గిరాటువెట్టాడు. డ్రెస్ విప్పేసుకున్నాడు. మొహంచిట్లించుకుంటూ అటూ యిటూ పచార్లుచేస్తున్నాడు. 'పాడు ప్రపంచం మనుష్యుల్ని అర్థం చేసుకోలేదు. తిని తీరిగ్గాకూర్చుని తంపులు పెట్టమంటే తయారు! ఇంకేమీ పనుండదు. అందరికీ దూరంగా వుండి పోదామనుకున్నా, అట్లావుండనీయరు. ఏదోఒకటి మీదకు తెస్తూనేవుంటారు. దీనికి అర్థమేమిటో తెలీదు.' తెగ చిరాకు పడుతున్నాడు.

కమల కాలేజీపుస్తకాలదొంతర్లు పట్టుకుని బరువుగా అటువైపు వెళుతున్నట్లు చూశాడుచంద్రం. ఆవేశంగా చప్పున వాకిటిలోకివెళ్ళి "కమలా" అని వెర్రిగాపిలిచాడు. తుళ్ళిపడిందికమల. ఆపాదమస్తకం కంపించింది. అటూఇటూ భయంగాచూసింది ఎవరైనా తనను పసికట్టారేమోనని. వణకిపోతున్న పుస్తకాలదొంతర్లను క్రిందపడనీయకుండా

జాగ్రత్తగానేపట్టుకొంటూ మెల్లిగా చంద్రంగదివైపుకు నడిచింది.

వచ్చినప్పటినుంచీ చంద్రాన్ని పలకరిద్దామని అనుకుంటున్నా తెచ్చిపెట్టుకున్న సిగ్గుబరువుతో వుండిపోయింది. ఈనాడు ఆమెకు ఏదో బుద్ధిపుట్టింది. ఎట్లాగయినా చంద్రాన్ని పలకరించాలని పట్టుపట్టింది. ఏవోపుస్తకాలు పట్టుకుని వెళుతున్నట్లు అటువైపుకువచ్చింది. చంద్రమే పలకరించకపోతే తానే ఏదోవిధంగా మాట్లాడాలని వచ్చేది. కాని ఆభారాన్ని చంద్రమే మోశాడు. తనకు తేలికయింది. రెండడుగుల్లో చంద్రంరూముకు వచ్చేసింది. అటూయిటూ రూమంతా వింతగా చూస్తూకూర్చుంది. ఎవరేమిమాట్లాడాలో అర్థంకాక కొద్దిసేపటిదాకా మౌనంగానే వుండిపోయారు. లోపలికన్నుతే వచ్చిందేకాని ఏమిమాట్లాడాలో తోచటంలేదు. కాస్తంతచప్పుడయినా ఎవరోవస్తున్నట్లుగా భయపడిపోతోంది.

ఎందుకుపిలిచావ్ అన్నట్లు చంద్రంమొహంలోకి తీక్షణంగాచూసింది. తన అస్తిత్వాన్ని మరిచిపోయి, మరో ప్రపంచంలోకి వెళ్ళికూర్చున్నాడు. ఒకర్నొకరు చూసుకుంటూ కళ్ళతోనే భావాలు వ్యక్తంచేసుకుంటున్నారు. ఈ తన్మయత్వంలో లోపలికి రమణవచ్చి కూర్చోవటం యిద్దరుగూడా గమనించనేలేదు

చప్పున కమలకళ్ళు కదలటం ప్రారంభించి రమణవైపుకు వెళ్ళి, అమాంతం మూసుకుపోయినాయి. మూర్ఛ

వచ్చినంతపనయింది. చంద్రమవుతే కళ్ళు విదిలించాడు. రమణఆకృతి స్పష్టంగా కనిపించింది. చెర్రుమన్నాడు. కాని రమణ చిరునవ్వుతో ఆప్యాయతఉట్టిపడుతున్నట్టు చంద్రం మొహంలోకిచూస్తూ, "భుజంగరావుగారి యిచ్ఛకూడా యిదే" అన్నాడు గంభీరంగా.

వెనక్కు తగ్గాడుచంద్రం. పీపుతట్టినట్టయింది. కమల ఆదరాబాదరాగా పుస్తకాలుతీసుకుని ఒక్కఅంగలో వాకిటి లోకివెళ్ళిపడింది. రమణపిలుస్తున్నా పలక్కుండా చక్కగా యింటికి నడిచింది.

"అవును. వారే చెప్పారు, స్వయంగా. వారి అభి మతం యిదే! అఖిలకుకూడా ఏదోఒక సంబంధం వెదుక్కు రమ్మనికూడా చెప్పారు. ఈ మాట నీతో వారిమాటగా చెప్పటానికే యిప్పుడు యిక్కడికి వచ్చాను." అన్నాడు రమణ బింకంగా.

చంద్రం మూగవాడయి పోయాడు. రమణమీద తనకున్న కోపమంతా కరిగిపోయింది.

"నే వెళ్ళొస్తా" అంటూ చివాలున లేచాడు రమణ.

చంద్రం ఏమీ మాట్లాడలేకపోయాడు. కాని రమ ణకు తానేదో అన్యాయం చేశానేమోనని మాత్రం వికృత ముగా ఆలోచించటం మొదలుపెట్టాడు. పట్టుచిక్కటంలేదు. 'రమణ చాలా మంచివాడు' అనుకున్నాడు. క్షణంలో భుజంగరావుగారిమీదకు తనమనస్సు మరలింది. "ఆదర్శపురు షుడు, గొప్ప వ్యక్తి. ఇక్కడికివచ్చి ఆయనదగ్గర పనిచెయ్య

డం మొదలుపెట్టినప్పటినుంచి లా ఒక్కటే నేర్చుకోవటం కాదు. జీవితంలో అవసరమైనవాటి విలువలు తెలుసుకున్నాను.

కేవలం ఓసిద్ధాంతాన్ని, ఓఆశయాన్ని, ఓ ధ్యేయాన్ని పెట్టుకుని కూర్చుంటే లాభంలేదు. జీవితానికి అది సరిపోదు. ధ్యేయమేమిటో మనకు కనిపించదు. ఆశయమేమిటో అసలు అర్థంకాదు. కనుచూపు మేరలో కనిపిస్తున్నంత వరకు ఆ సూటి రోడ్డుమీదే నడుస్తూ మలుపు తిరగాల్సివచ్చినప్పుడు ఎటు తిరగటమా అని ఆలోచించుకోవాలి. జీవితంకూడా వంకర టింకర రోడ్డులాంటిది. ఆరోడ్డుచివర యిక్కడనుంచే చూడలేము? ప్రతి మలుపులోనూ ఆగి నిర్ణయించుకోవాలి. భుజంగరావుగారు ఈ జీవనయానాన్ని నాకు చూపారు. వారికి ఎంతో ఋణపడివున్నాను. ఏమైనా నా కృతజ్ఞత ఆయనకు వెల్లడించుకుంటేగాని నాహృదయు భారంతగ్గదు. నేను వెళ్ళి ఆయనకు చెప్పుకుంటాను.'' ఆవేశంగానూ, ఉద్రేకంగానూ, తూలుతూ గభాలున తలుపులు రెంటినీ దగ్గరకు లాగి బంధించివేశాడు ఒకే ముడితో.

భుజంగరావుగారు ఆఫీసుగదిలో తన గుండ్రటి కుర్చీలో కూర్చుని మెల్లిగా తిరుగుతూ రెండు అరచేతులను తాకీ తాకకుండా కలుపుకుంటూ తల వూపుతున్నాడు. ఆయన మెదడులో ఏమాలోచనలు మెదలుతున్నాయో!

ఇక యిప్పుడు చెయ్యాల్సిందేమిటి? ఒక నిర్ణయానికి రావాలి. ఈ విధంగా చెయ్యాలి, అని ఆలోచనలు చేసు

కుంటున్నాడు. పెద్దగా నిట్టూరుస్తూ ఆయాసపడుతున్నాడు. చంద్రంరాక గమనించి తల పైకెత్తి చూశాడు.

రమ్మనమని కళ్ళతోనే సంజ్ఞచేసాడు. గభాలున లోపలికెళ్ళి ఎదురుకుర్చీలో కూర్చున్నాడు.

..."నేను మీతో యిన్నాళ్ళనుంచి చెపుదామనుకుంటూనే చెప్పలేక, ఎట్లాచెప్పాలో చేతకాక ఊరుకుండిపోయాను. మొట్టమొదట మీరు నన్ను ఆహ్వానించినప్పుడు మీలో ఉన్న గొప్పతనాన్ని గ్రహించుకోలేకపోయాను. ...కాని రాను రాను నాకు జ్ఞానోదయమైంది. పట్టుదలపట్టి ఏదో ఆశయమంటూ పెట్టుకుని మనస్సు పాడుచేసుకున్నాను. కాని జీవితమంటే ఒకే ధ్యేయాన్ని ఒకే ఆశయాన్ని పెట్టుకుని కూర్చోవటం కాదని మీ దగ్గర నేర్చుకున్నాను. ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగావుంటూ జీవితంలో చేతికి అందినదాన్నే స్వీకరించి దాంతోనే తృప్తిపడి దాన్లోనే ఆశయాన్ని చూసుకోవాలని మీ దగ్గర నేర్చుకున్నాను.... నా కృతజ్ఞతను మీకు యెట్లా వెల్లడి చేసుకోవాలో అర్థం కావటం లేదు...." లేచి నిలబడ్డాడు. ఆయాస పడుతున్నాడు. శరీరమంతా ముచ్చెమట్లు పోసినాయి.

చంద్రం మొహంలోకి అచేతనంగా అట్లాగేచూస్తూ భుజంగరావు మొద్దుబారిపోయాడు.

సమాప్తం





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B149 |
| పుస్తకం పేరు | మంచుతెరలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 139 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1to2 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |